# శ్రీ దేవీసువర్ణమాలా

## స్వీయాంధ్రవ్యాఖ్యాసహితా

విద్వచ్ఛిరోమణి

అవధానమ్ చంద్రశేఖరశర్మా

సాహితీ సామ్రాజ్యమ్

ప్రొద్దుటూరు

SRĪ DĒVĪSUVARṆAMĀLĀ - SVĪYĀNDHRA VYĀKHYĀ SAHITA

Publishers SĀHITĪ SĀMRĀJYAMU, Proddatur

First Edition 1995

Copies 1000

Rs 15

For Copies

1 A Chandrasekhara Sarma
26/921, South Side of Arts College
PRODDATUR - 516 360
Cuddapah Dist

2 Dr A R Vachaspathy
P V P Evening Oriental College
KAMAREDDY - 503 111
Nizamabad Dist

ఈ గ్రంథం తిరుమల తిరుపతి దేవస్థానముల
ఆర్థిక సహాయంతో ముద్రించబడింది

Laser Typeset Lakshmi Graphics, 2-1-476 Nallakunta, Hyderabad-44

Processing & Printing Charita Graphics-Offset Printers, Chikkadpally Hyderabad

# ఆశీర్వాదః

Private Secretary
to His Holiness
**Sri Jagadguru Shankaracharya**
Dakshinamnaya Sri Sharada Peetham
SRINGERI - 577 139 (Karnataka)

Camp శృంగగిరి:
Ref D01-11257
Date 12-9-95

శ్రీమత్సు అవధానాళిజన చంద్రశేఖరశర్మను సాదరా విజ్ఞప్తిః

భవత్ప్రహితాం దేవీసువర్ణమాలాస్తుతిం అవలోక్య శ్రీ జగద్గురుచరణాః నితరాం ప్రసన్నస్వాంతా అభూవన్

సకల జగజ్జనన్యాః పరదేవతాయాః కృపా ప్రపాకేణ ఏతత్స్తుతిరచనేన భవంతః భవదీయాం కవిత్వశక్తిం సార్థకయన్ అనేకేషు వృత్తేషు రచితా నీమాని పద్యాని ఛందశ్శాస్త్రే భవతాం వైదుష్య మావిష్కుర్వంతి ఏకైక స్యాఽపి శ్లోకస్య నిగూఢ భావ ప్రతిపాదక తాత్పర్యోపవర్ణన మపి పఠితౄణాం అర్థావగతిం తద్ద్వారా మహాంత మానందం చ జనయతి

ఈదృశ విశిష్ట స్తుతి రచయితారో భవంతః జగదంబాయాః అనుకంపా పూరేణ శ్రేయః పరంపరా అవాప్య ఇష్టమేవ భవద్వాంఛితం సఫలయంతు. ఇయం చ స్తుతిః భక్త జనపాణి పల్లవ విభూషణం భూయా దితి గురుచరణా ఆశాసతే

నివేదయితా
(సం)

**Prof P G LALYE** M A Ph D
Bhandarkar Oriental Research Institute
PUNE

## దేవీ సువర్ణమాలా – ఏకః సంక్షిప్తః పరిచయః

సంస్కృత భాషాయాం వా అన్యస్యాం కస్యాంచి ద్భాషాయాం వా వర్ణానాం మాహాత్మ్యం భూరిశో వర్తతే వాక్యస్య ఘటకం పదం పదం తు సుబంతం వా తిజంతం వా అక్షరై రేవ స్వాకారం స్వరూపం చ లభతే వర్ణ-పద-వాక్య-సమూహాత్మికా ఖలు భాషా భాషా ప్రాణభూతా భావనానామ్ అత యతో భాషాయా ఉద్భావనం మనుష్యైక సాధ్యం, తథా పదానాం తదవయవీభూతానాం వర్ణానాం చ

ఏత ద్వర్ణానాం లౌకికం రూపమ్ కింతు సంస్కృత సాహిత్యే, విశేషత స్తంత్ర సాహిత్యే వర్ణానా మన్య దేవ గౌరవం వరీవర్తి తంత్రదృష్ట్యా వర్ణో న కేవలం స్థానప్రయత్నోద్భూతో ధ్వని విశేష అపితు దైవశక్తియుక్తం ఓజ పూర్ణం బిందురూపమ్ ప్రతివర్ణే దేవ్యా భగవత్యా శక్తి ప్రతివర్ణం వ్యాప్య సముత్తిష్ఠతి వాగ్దేవ్యా ప్రత్యక్షర మనుప్రవేశనం తస్యా సూక్ష్మం భావరూపం విలసతి అత ఏవంవిధా శక్త్యను ప్రాణితా వర్ణా బీజాక్షరరూపేణ పరిణతా భగవత్యా వివిధాని రూపాణి ప్రదర్శయంతి తథాహి ఐం వాగ్బీజం, హ్రీ మితి మహాత్రిపురసుందర్యా ఈ మితి కామకలాయా ఇతి బీజాక్షరాణి సాధకానాం జపాంగభూతాని తంత్ర విద్యాయాం విఖ్యాతాని వర్తంతే సర్వాణ్యపి బీజాక్షరాణి భగవత్యా దివ్యం రూపం నిరూపయంతి భగవత్యా 'సర్వం ఖల్విదం బ్రహ్మ' రూప మేవ ప్రతిపాదయంతి

వర్ణానాం శక్త్యనుప్రాణితత్వం మనసి నిధాయ శ్రీ పండితవర్యా శక్త్యుపాసనైక భాగా చంద్రశేఖరశర్మ మహోదయా దేవీసువర్ణమాలాం వ్యరచయన్

అస్మిన్ స్తోత్రే చతుఃపంచాశచ్ఛ్లోకా. విద్యంతే ప్రతి శ్లోక స్యాద్యక్షరం పారంపరిక వర్ణమాలానుసారం గృహీతం కవివర్యేణ వర్ణశక్తి సర్వే ష్వపి వర్ణే ష్వంతర్భావి నీ త్యుపదేష్టు మివాయం క్రమోఽను సృత స్తోత్రకృతా య ద్యపి ఛందోదృష్ట్యా వ్యాకరణ దృష్ట్యా చ సులభత్వం దరీదృశ్యతే శ్లోకేషు వ్యుత్పన్నోఽయం కవి రచనా చాతురీం బహుత్ర ప్రాదర్శయత్ అనుప్రాసాలంకార శబ్దచమత్కృతిం జనయన్ కమపి లయ మాపా దయతి తదలంకార ప్రయోగే బహుత్ర ఆంధ్రభాషా వైశిష్ట్యం ప్రదర్శిత ముభయ భాషా కోవిదానాం రమ్యతరం స్యా దితి ధ్రువమేవ లయగతిం పరిపాలయన్ కవిః

స్తోత్ర మాధుర్యం సుష్ఠు నిర్మితేన్మ ప్రాయ ఏకవింశతి శ్లోకేషు ప్రాసచమత్కారోఽవ లోక్యతే పంచవింశతమే శ్లోకే ణకారస్థానే ఆగంతవ్యే నకార ఆగత ఏక చత్వారింశత్తమే శ్లోకే థ ధయోరపి తథైవ ప్రయోగో దృశ్యతే ఏవం విధ ప్రయోగ యతి ప్రయోజనే తెలుగు భాషాయా మేవ దృశ్యతే' 20 40 శ్లోకా యతివిశిష్టా వర్తేతే

ప్రాసమాధుర్యం కథం వర్తేత ఆస్వాదయంతు రసికా

ఋతే త్వా మనిశో జగత్కర్తుమీశ
కృతం చాన్య దేవార్చ నాయాసనేన ।
మతో వా నవాఽహం సుత స్తే హి మాత
కుతోఽస్మి న్నుపేక్షాధుత స్నేహబంధ ॥

అన్యచ్చ

అంహోవిదారిణి! సమస్త శుభైకమూలే ।
బంహిష్ఠ పుణ్యపరిపాక విశేష లభ్యే!
రంహస్వి మే హృదయ మద్య విశ త్వవిద్యా
సంహారి ణీశ్వరి! భవచ్చరణాబ్జయుగ్మే ॥

త్రిప్రాసరూపం మనోహరత్వం విద్యతే ఏకస్మిన్ శ్లోకే

సకలోపనిషద్రహస్యసారాం
సకలంకాత్మ దురాపదృక్ ప్రసారాం ।
సకలాపకలోజ్జ్వలాపచూడాం
సకలేశీం సముపాశ్రయే భవానీమ్ ॥

అలంకారై స్సమం శబ్ద శయ్యాఽపి హృద్యా వర్తతే స్తోత్రేఽస్మిన్ 'చలతి న చలతి చ యస్మిన్ ఇది శ్లోకే శబ్దసంహతి చమత్కృతి జనకా వర్తతే సర్వత్ర శ్లోకానాం తాత్పర్య నిర్దేశ పూర్వకం వైశిష్ట్యాని సాధారణ ప్రకృతీనాం పాఠకానాం కృతే కవి మహోదయా ఉదటంకయన్

సంపూర్ణే స్తోత్రే కవివర్యస్య భగవత్యాం జగదంబాయాం యా దృఢా భక్తి ర్వర్తతే,

---

1 నాఽత్ర ప్రాసస్థానే నణయో థధయో ర్వాసాంకర్యం శంక్యమ్ సంస్కృతే ప్రాసనియమాభావా దనుప్రాస స్యాలంకారమాత్రస్య వివక్షాపరతంత్రత్వా దత్ర చ తస్య పృథక్ ప్రయత్న నిర్వర్త్యత్వా దాలంకారిక సమయానురోధేన సవివాపేక్షిత - ఇతి దిక్ - అ చం శ

తస్యాః సాక్షాత్కారో భవతి భక్తిరసపూర్ణ మేతత్ స్తోత్రం రచయితు ర్భక్తి తుందిలం మన ఏవ ద్యోతయతి

వర్తమానే ష్వపి శతాధికేషు దేవీస్తోత్రేషు అన్య స్తోత్రస్య సులభార్థస్ఫురణం పద విన్యాస మాహాత్మ్యం చ అవివాద్యమ్

ఏతత్ స్తోత్రం చంద్రశేఖర మహోదయానాం రచనా వైశిష్ట్యం ప్రతిపాదయత్ పఠితౄణాం దేవీ సాధనా మపి ప్రేరయతు

ఇతిశమ్

ప్రగ లాలే

# అభినందనము

తర్క వ్యాకరణ వేదాంత శాస్త్రాలంకార
**బ్ర శ్రీ మారి రామకోటిశాస్త్రి**
రాష్ట్రపతి బహుమతి గ్రహీతలు
విశ్రాంత ప్రధానాచార్యులు
సంస్కృత కళాశాల (తెనాలి)

శ్రీమాత్రే నమ - శ్రీ గురుభ్యో నమ.

బ్రహ్మశ్రీ అవధానము చంద్రశేఖరశర్మగారు శ్రీ విద్యా సంప్రదాయము లోనివారు పురాకృత సుకృత ఫలముగా ప్రసన్న మధుర కవితాశక్తి అలవడినవారు తమ మధుమయ ఫణితిలో వాగ్దేవిని సమారాధించుచున్నారు సంస్కృత భాషలో మాతృకా వర్ణమాలను తీసికొని ఏకైక వర్ణమునకు నొక్కొక్క శ్లోకముతో శ్రీ త్రిపురసుందరీదేవిని స్తుతించినారు తాము రచించిన శ్లోకములకు తెలుగు భాషలో తాత్పర్యమును విశేషార్థములను పాఠకులకు వీనులకు విందుగా మనోహరముగా పొందుపరచినారు సౌందర్యలహరిలో శ్రీ శంకర భగవత్పాదులు త్వదీయాభి ర్వాగ్భి: తవ జనని నీరాజన మిదమ్" అని ముగించిన రీతిగా ఈ పరదేవతా స్తోత్రమును శ్రీ త్రిపురసుందరీ పరాభట్టారికా దేవికే సమర్పించి శ్రీ దేవియొక్క అనుగ్రహమునకు పాత్రులైనారు ఎంతో భావనాశక్తియు, శ్రీ దేవీ భక్తియు నొనగూడిననే గాని అపూర్వమగు నిట్టి సువర్ణమాలా స్తుతిని రచించుట సాధ్యము కాదు శ్రీ దేవి యనుగ్రహము చేతనే సులలిత శబ్దార్థములతో విరోధా భాసాద్యలంకారములతోను మధుర భావముతోను ఈ సుబంధుర రచన సాగినది సౌందర్యలహరి, లలితా సహస్రనామ భాష్యాదులను బహువారము పారాయణ మొనరించి శ్రీ దేవీసాక్షాత్కారమునకై పరితపించి భావనలో శ్రీ మాతను ఎదుట దర్శించి కొన్ని శ్లోకములు రచించినట్లు కనిపించును సంస్కృత భాషమీద, ఛందస్సు మీద స్వాతంత్ర్య ముండుటచేతనే కొన్ని అక్షరములలో పద్యములను గూర్చి కృతకృతులగుట జరిగినది దీనికితోడు భావనాశక్తి కవితకు శోభను గూర్చినది శ్రీ త్రిపురసుందరీ దేవి అనుగ్రహము కోరువారికి ఈ శ్రీ దేవీసువర్ణమాల పఠనీయముగా అలరారుచున్నది తెలుగు భాషలో రచించిన తాత్పర్య విశేష వివరణాదులుకూడ తెలుగు నుడికారముతో

నూత్న కాంతితో అలరారుచు పాఠకుల హృదయములను ఉత్తేజపరచుచు భక్తిభావమును, జగన్మాతయందు పూజ్య భావమును పెంపొందింప జేయునవిగా నున్నవి ఎచ్చటను సంప్రదాయమునకు దూరముగాక పురాణ తంత్రముల ననుసరించియే కవిత అమృత రసవాహిని యైనది మూలమునందు వివరణాపేక్ష ఉన్నచోట క్రింద ప్రమాణ వచనముల నుల్లేఖించుచు విశేషార్థ వివరణము జరిగినది సంస్కృతాంధ్రముల శ్రీ దేవిని రమ్యముగా స్తుతించి వాక్కును, శ్రీ త్రిపురసుందరీ భావనతో మనస్సును శుద్ధ మొనర్చుకొని శ్రీ పరదేవతానుగ్రహమునకు పాత్రులైన బ్రహ్మశ్రీ అవధానము చంద్రశేఖరశర్మగారు మహనీయులు మిక్కిలి ధన్యులు వారికి శ్రీ త్రిపురసుందరీ దేవి చిరాయురారోగ్యైశ్వర్యములను సుఖశాంతులను ఒసంగి కృతార్థులను చేయుగాక ఈ శ్రీ దేవీసువర్ణమాలా గ్రంథము సంస్కృతాంధ్ర పాఠకుల హృదయములను అలరించి జగన్మాతయందు భక్తిని ఇనుమడింప జేయుచు వ్యాప్తిని పొందుగాక।

ఇట్లు

**సూరి రామకోటిశాస్త్రి**

శ్రీః

శ్రీ బాలాత్రిపురసుందర్యై నమః

# విజ్ఞప్తి

య చ్ఛిదంశ పరిష్వంగాత్ పరిస్రవతి వాఙ్మధు ।
స్వాంతాంబుజవికాసిన్యై తస్యై భాసే నమో నమః

దాదాపు ముప్పదియేండ్లనాటి మాట యిది. నెల్లూరు మండలమున నున్న యజ్ఞవాటికా (జన్నవాడ) క్షేత్రమున వెలసియున్న కామాక్షీదేవి దర్శనభాగ్యము నందినప్పుడు నా హృదయమున కలిగిన సంకల్పము పరదేవతానుగ్రహమున అచిర కాలములోననే యీ సువర్ణమాలగా అవతరించినది. దీనిని తొలుత సాధారణ స్తోత్రముగానే రచింపదలచితిని. కాని పంచాశన్మాతృకా వర్ణరూపిణి యగు పరమేశ్వరిని ఒక్కొక్క వర్ణమును ఒక్కొక్క బీజముగా భావించి వర్ణసమామ్నాయ క్రమమున స్తుతి రచనము కావించుట యుచితతర మని తోచినది. అమ్మకు ఒక సువర్ణమాలను అలంక రించినట్లగు నను నుబలాటమును తోడైనది. భిన్నభిన్నము లగు చిత్తవృత్తులు దేవ్యారాధన మున నేకోన్ముఖములై ధన్యత నందు నను భావమును సూచించుటకు ఇందు భిన్నభిన్నములగు వృత్తములను గ్రహింపదలచితిని. రచనము నారంభించితిని. కాని పదాదిని దుర్లభములైన ఙ ఞ మొదలగు వర్ణములను ఎట్లు పొందించుట? సర్వశక్తిమతి యగు పరమేశ్వరి యనుగ్రహమున తత్త దుచితభావములు స్ఫురింపగా రచనము పూర్తియైనది. పలుచోటుల పలువురు పండితులు దీనిని విని ఆనందించి ప్రకటనమునకై ప్రేరేపించిరి. వారిలో ప్రొద్దుటూరులో శ్రీ మళయాళస్వామి ప్రాచ్య కళాశాలలో సహాధ్యాపకులుగా నున్న నా మిత్రులు విద్వత్కవి కీ॥శే॥ బండ్ల వెంకట రమణయ్య గారును మరి కొందరు విద్వచ్ఛ్రోతలును ఇందలి శ్లోకములలోని నిగూఢ భావములను తెలుగులో తాత్పర్య సహితముగా వివరించినచో సాధారణ పాఠకులకు గూడ సుబోధ మగు నని సూచించిరి. తదనుసారముగ అట్టి వివరణమును పొందుపరచితిని. ఇది జరిగియు చాలసంవత్సరములే గడచినవి. కాని ఆర్థికమగు నశక్తత గ్రంథ ముద్రణమునకు అవరోధమైనది. ఇప్పుడు ఇంతకాలమునకు పరమేశ్వరి యనుగ్రహముననను, తిరుమల తిరుపతి దేవస్థానము వారి యుదార సాహాయ్యము వలనను ఇది వెలుగు చూచినది. సర్వమును కాలాపేక్షికదా!

అల్పజ్ఞుడనగు నా యీ రచనమును శ్రీశ్రీ జగద్గురు, దక్షిణామ్నాయ శ్రీ శారదా

పీఠ శృంగేరి మహాసంస్థానాధీశ్వరులు ఆశీఃప్రదానమున అనుగ్రహించుట మహాభాగ్యముగా భావించుచున్నాను

సుప్రసిద్ధమగు భాండార్కరు పరిశోధనా పీఠమున పరిశోధక విద్వదగ్రేసరులగు ఆచార్య పి జి లాలే, మహోదయులు గ్రంథ పరిచయమును ప్రసాదించుటయు, మహా విద్వాంసులు 'తర్క వ్యాకరణ వేదాంత శాస్త్రాలంకార' బిరుదాంకితులు రాష్ట్రపతి బహుమతి గ్రహీతలు తెనాలి సంస్కృత కళాశాల విశ్రాంత ప్రధానాచార్యులు ఋషికల్పులు బ్రహ్మశ్రీ సూరి రామకోటిశాస్త్రి గారు అభినందించి ఆశీర్వదించుటయు పరమేశ్వరీ ప్రసాద లబ్ధములుగా భావించుచున్నాను

శ్రీశ్రీ జగద్గురువులకును ఈ మహామహద్వయమునకును కృతజ్ఞతాపూర్వక సాష్టాంగ ప్రణామముల నర్పించుచున్నాను

ముద్రణమునకు ఆర్థిక సాహాయ్యమును గావించిన తిరుమల తిరుపతి దేవస్థానము వారికి నా కృతజ్ఞతను తెలుపుకొనుచున్నాను

టి టి డి వారికి పంపుటకు పరిశుద్ధ ప్రతులను సిద్ధము చేయించియు శ్రద్ధగా ప్రూపులు దిద్ది, ముద్రణ కార్యమును సమర్థముగా నిర్వహించియు సాహాయ్యపడిన మా చిరంజీవులు డా॥ రంగనాథ వాచస్పతి, డా॥ ఉమామహేశ్వరశాస్త్రులను ఉత్తరోత్తరాభివృద్ధిగా ఆశీర్వదించు చున్నాను

అభిజ్ఞులును దేవీభక్తవరేణ్యులును నా యీ రచనము నాదరించి నన్ను దేవీ ప్రసాదపాత్రునిగా కృతార్థుని చేయుదురు గాక యని సవినయముగా ప్రార్థించు చున్నాడను

ఇట్లు
బుధజన విధేయుడు

కామారెడ్డి
17-11-1995

**అవధానము చంద్రశేఖరశర్మ**

శ్రీః

# శ్రీ దేవీసువర్ణమాలా

అమృతమయీ మమృతకళా
మమృతాంశు కలా కలాపకోటీరాం ।
అమరనుతా మభవరతా
మవలంబే త్రిపుర సుందరీ మంబామ్ ।

**తాత్పర్యము :**

అమృత స్వరూపిణియును, అమృత మయము లగు పదునారు కళలు (నిత్యా షోడశికా రూపమున) గా ప్రకాశించునదియును, అమృత కిరణుడగు చంద్రుని కళను కిరీటాలంకారముగా గలదియు, దేవతలచే స్తోత్రము చేయబడునదియును, పరమేశ్వరునియందు ఆసక్తి కలదియు జగన్మాతయు నగు బాలా త్రిపురసుందరీ దేవిని ఆశ్రయించుచున్నాను

**విశేషములు :**

1 "అమృతమయీం' పరదేవత అమృత స్వరూపిణి
*ఓంకారరూపి ణ్యజరా శివానం తామృతద్రవా"* (స్కాందము)

2 "అమృతకళాం" శిరస్సు నందలి సహస్రార కమలమునందు సాదాఖ్య మగు కళ యోగులకు ధ్యానైక గమ్యమై ప్రకాశించును ఆ కళ పరమేశ్వరీ స్వరూపమే" అని భావము

3 "అమృతాంశు   రాం" సగుణధ్యానమున పరమశివునకు వలె పరమేశ్వరికిని చంద్రకళ శిరోభూషణము "చతుర్భుజే చంద్రకళావతంసే" అని దేవీస్తుతి

4 "అమరనుతాం", "ఆ తల్లిని నుతించు భక్తులును అమరత్వము నందుదురు" అని భావము

5 "అభవరతాం" అభవుడు అనగా పుట్టుక లేనివాడు - ఆద్యంత శూన్యుడు - నిత్యుడు పరమేశ్వరి ఆయనకు అంతర్గతయై ఆయనకంటె అభిన్నయై నిత్యయై యున్నశక్తి

6 "త్రిపుర సుందరీం" స్థూల, సూక్ష్మ, కారణదేహములు, సత్త్వ రజస్తమములు, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములు మొదలగు త్రికములు అన్నింటికిని 'త్రిపురములు' సంకేతము వానికి పరమేశ్వరియే అధీశ్వరి ఆమె సౌందర్యము అనిర్వాచ్య మైనది; సృష్టి క్రియామూలము కావుననే ఆ దేవి త్రిపురసుందరి

7 "అంబాం" ఆమె జగన్మాత తల్లికి మించిన దైవ మేమున్నది? "న మాతుః పరదైవతమ్" అని పెద్దలమాట కావుననే ఆ తల్లినే ఆశ్రయించుట

ఆనందిత శిఖికంఠా
మమృతా సారైక వర్షిణీ మాద్యాం ।
ఆర్యాంకా మాకలయా
మ్యంబుద లేఖా మపూర్వ కమనీయామ్ ।

తాత్పర్యము :

పరమేశ్వరి తొలకారున తొలుసారిగా కనపడునట్టి యొక మేఘమాలికగా తోచును ఈ సరిక్రొత్త మేఘమాలిక సామాన్యమైన దానికంటె విలక్షణమైనది సాధారణమైన మేఘమాలిక శిఖికంఠములకు - అనగా నెమళ్లకు ఆనందమును కలిగించును వర్షధారలను కురియును ఎదురు చూచు జనులకు కన్నుల పండువు చేయును మరి 'ఆర్య' అను పేరుగల యీ మేఘమాలిక శిఖికంఠునకు అనగా పరమేశ్వరు డగు శివునకు ఆనందమును కలిగించును ఎడతెగని యమృత ధారలను వర్షించును ఎప్పుడును, ఎక్కడను ఎరుగనంత సౌందర్యముతో ప్రకాశించును అట్టి పరమేశ్వరిని ధ్యానించెదను

విశేషములు :

(1) "అమృతా వర్షిణీం" సాధకులు మూలాధారమునందు అణగియున్న కుండలినీ శక్తిని యోగమార్గమున సహస్రారమునకు కొనిపోయి దానిలో అచట కర్ణికా రూపమున నున్న చంద్రమండలమును తాకినప్పుడు శరీరములో నాడీమండల మంతటను అమృతము స్రవించినట్లు ఒకానొక తనువు వారికి అనుభవమునకు వచ్చును

"సుధాసారాభి వర్షిణీ" (లలితా సహస్ర నామావళి), "కిరంతీ మంగేభ్యః కిరణ నికురుం బామృతరసం" (సౌందర్య లహరీ)

(2) ఆద్యాం' ఎండకాలమున తాపతప్తు లగు జనులకు తొలుసారిగా కనుపడిన మేఘము ఎంతో సంతోషమును కలిగించును అట్లే సంసార తాపతప్తులకు దేవీ దర్శనమును అని భావము

ఇరమ్మద శతోజ్జ్వలా మిద మద స్త ద ర్థాతిగాం
నిరీహ హృదయే శయా మనమ నిత్య సౌభాగ్యదాం
పురాతన వినూతన ప్రసవ సౌరభోద్గారిణీం
సురద్రులతికా మయే త్రిపురసుందరీ నామికామ్ ।

తాత్పర్యము :

ఒక్కసారిగా నూరుల కొలది మెరుపులు మెరుసినంతటి తేజస్సుతో ప్రకాశించునదియు "ఇదిగో ఇది" అని గానీ, "అల్లంత దూరములోనిది" అనిగానీ, లేదా "చాల దూరములో నున్నది" అనిగానీ నిర్దేశించుటకు శక్యము కానిదియు, అన్ని కోరికలను వదలిపెట్టిన మహాతపస్వుల హృదయమునందు హాయిగా నుండునదియు, సాటిలేని, శాశ్వతమైన సౌభాగ్యమును సంపాదించునదియు, ప్రాచీనములగు వేదములును తరువాతవి యగు ఆగమములును అను పూవులలోని పరిమళమును గుబాళించునదియు నగు త్రిపురసుందరి యను పేరు గల కల్పవృక్షమును ఆశ్రయించుచున్నాను

విశేషములు :

(1) "ఇరమ్మద    లాం' - 'తటిల్లతా సమరుచిః' (ల స నా)

(2) "నిరీహ    యాం" దారా పుత్రాదుల మీద కోరికలు లేనివారికి మాత్రమే దేవీ దర్శనము సాధ్యము "ఏషణారహితాదృతా" (ల త్రి)

(3) పురా    ణిం" వేదములును, శాస్త్రములును పూవులుగాను దేవి కల్ప వృక్షముగాను భావింపబడుటవలన ఆ వేద శాస్త్రములు గూడ ఆమెనుండియే కలిగిన వనియు, వాని భావములు ఆ దేవి యుత్కర్షమునే ప్రకటించునవి అనియు భావము

ఈశా మాశాదూరా
మిందీవరలోచనాం హిమాద్రిసుతాం ।
కేశవసహజాం దహరా
కాశేందుకలా మయే జగజ్జననీమ్ ।

తాత్పర్యము :

సమస్త ప్రపంచమును సృష్టించుటకును, పోషించుటకును, లయము చేయుటకును సంపూర్ణమును, స్వతంత్రమును నగు సామర్థ్యము కలదియును, ఏ కోరికలకును (కోరిక కలవారికి) అందనిదియును, నల్లకలువవంటి కన్నులు కలదియును హిమవంతుని కూతురును, శ్రీ మహావిష్ణువునకు తోబుట్టువును, ఉపాసకుల హృదయమునందలి సూక్ష్మాకాశమును చంద్రకళవలె ప్రకాశింపజేయునదియు నగు ఆ జగన్మాతను ఆశ్రయించుచున్నాను

విశేషములు :

(1) "ఇందీవర నాం" ఇందీవరమను పదమునకు లక్ష్మీదేవికి ప్రియమైనది అని వ్యుత్పత్త్యర్థము. అందువలన అట్టి కన్నులుగల దేవి కటాక్షములు ఉపాసకులకు భౌతికాధ్యాత్మిక సంపదలను కలిగించును

(2) "హిమాద్రిసుతాం" మంచుకొండ కూతురు గావున ఆజన్మసిద్ధమైన చల్లదనములో భక్తుల తాపత్రయమును పోగొట్టును

పరమేశ్వరియే ఒక జన్మమున దక్షుని కూతురై సతిగాను మరు జన్మమున హిమవంతుని కూతురై పార్వతిగాను అవతరించె నని పురాణ ప్రసిద్ధి

(3) "కేశవసహజాం" శ్రీకృష్ణావతార సందర్భమునందు పరమేశ్వరుని యోగమాయ యశోదకు పుత్రికగా జన్మించి దుర్గా ప్రసిద్ధి నందినది అని భాగవతము

ఉమాం సుమాస్త్ర శాతన ప్రమోహ మోహ మూర్ఛికాం
క్రమోన్మిష న్నిజద్యుతి ప్రమోదితాశ్రితాంతరాం ।
తమోఽపహా మహార్యధుర్య నందినీ మనిందితా
మమోఘ దివ్య వైభవాం సమాశ్రయే భవోద్భవామ్ ।

తాత్పర్యము :

మన్మథుని నాశము చేసిన పరమేశ్వరుని గూడ మచ్చుమందువలె మైమరపింప జేయునదియు, ఉపాసకుల హృదయమునందు సాధనామార్గమున క్రమక్రమముగా తన దివ్యతేజస్సును ప్రకాశింపజేయుచు, నానందమును కలిగించునదియును, మనస్సునందలి యజ్ఞానమను చీకటిని తొలగించునదియును, సమస్త ప్రపంచముచేత స్తుతింప బడునదియును, ఎప్పుడుగాని ఎక్కడగాని పొల్లుపోని మహాత్మ్యమైన వైభవము కందియు, సమస్త సృష్టికిని కారణమైనది అయినను పర్వతరాజగు హిమవంతుని కూతురుగా అవత రించినదియు నగు పరమేశ్వరిని ఆశ్రయించుచున్నాను

విశేషములు :

(1) "ఉమాం" పార్వతీదేవి పరమేశ్వరుని వరునిగా కోరి తపస్సునకు పోవునప్పుడు ఆమె తల్లియగు మేనకాదేవి ఆమెను ఉ (= ఓ అమ్మాయీ!) మా (= వలదు - తపస్సునకు పోవద్దు) అని నిషేధించెనట అందువలన దేవికి ఉమ' అని పేరు వచ్చినదని పురాణముం వివరణము

"ఉమేతి మాత్రా తపసో నిషిద్ధా పశ్చా దుమాఖ్యాం సుముఖీ జగామ" అని కుమార సంభవము

(2) 'సుమాస్త్ర కాం' పూంబాణములచేతనే అన్ని లోకములను లోబరుచు కొన్న దిట్ట మన్మథుడు; అన్ని కోరికలకును ఆయన ప్రేరకుడు అటువంటి మన్మథునే నాశము చేసిన అచంచల హృదయుడు పరమేశ్వరుడు; ఆ పరమేశ్వరుని గూడ పరవశింప జేయజాలిన సామర్థ్యము కలిగినది పరమేశ్వరి

ఊహాపథ సమతీతా

ముపమారహితోజ్జ్వలాంగసౌందర్యాం ।

కోఽహం వర్ణయితుం త్వా

మేహి మదంబ! ప్రదేహి పదసేవామ్ ।

తాత్పర్యము :

తల్లీ! లోకములో నెవరైనను ఒక వస్తువును వర్ణింపదలచినప్పుడు దానిని మనస్సులో చక్కగా భావించుకొని, తనకు తెలిసిన సదృశ వస్తువులతో పోల్చి వర్ణింతురు మరి నీ రూపము ఊహాకే అందునది కాదే! విశ్వమోహనమగు సౌందర్యముతో మెఱసిపోవుచున్నదే! దానిని పోల్చుటకు సాటివస్తువే లేదు అట్టి నిన్ను వర్ణించుట యెట్లు సాధ్యము? అందును అజ్ఞానినగు నాకు ఏమి యోగ్యత యున్నది? "తల్లీ! నాకు దర్శన మిచ్చి నీ పాద సేవా భాగ్యమును కరుణింపుము" అని వేడుకొనుట యొక్కటి మాత్రమే నేను చేయగలను కావున దానిని నాకు ప్రసాదింపుము

విశేషములు :

(1) "ఊహా    తాం" ఊహాపోహలు మనోవృత్తులు. మనస్సు వృత్తిరహితము అయినప్పుడే అనగా యోగసిద్ధి యగు అమనస్కత ప్రాప్తించినప్పుడు మాత్రమే ఉపాసకుడు దేవీసాన్నిధ్యమును పొందదలుగుచున్నాడు

"యోగ శ్చిత్తవృత్తినిరోధః" (యోగ శాస్త్రము )

(2) "మదంబ!" నీవు నాకు తల్లివి; తల్లి, కుమారుని యోగ్యతా యోగ్యతలను విచారింపకుండ వాని యార్తనాదమును విన్నంతనే తనకు తానుగా వానియొద్దకు వచ్చి వానిని లాలించును అట్లే నీవును నన్ను అనుగ్రహింపుము

ఋతేత్వా మనీశో జగ త్కర్తు మీశః
కృతం ఛాన్య దేవార్చ నాయాసనేన ।
మతో వా న వాహం సుత స్తే హి మాతః
కులోఽస్మిన్నుపేక్షాధుతః స్నేహబంధః ।

తాత్పర్యము :

తల్లీ! నీవలననే పరమేశ్వరునకు ప్రపంచమును సృష్టించు సామర్థ్యము కలుగుచున్నది నీవు లేకున్న ఆ పరమేశ్వరునకు గూడ ఏమి చేయుటకును సామర్థ్యము లేదు అందువలననే ఇతరదేవతల నెవ్వరిని గాని పూజించు ప్రయాసమును మానుకొంటిని నీవు 'అవు'నన్నను 'కా'దన్నను నేను నీకు కుమారుడనే సుమా ఇట్టి నామీద ఏ తల్లికైనను కుమారునిమీద సహజముగా నుండు వాత్సల్యబంధమును ఎందుకు ఉదాసీనతతో విదిలించి త్రోసి వేయుదువు?

విశేషములు :

(1) "ఋతే మీశః" అయిన ఈశుడే - అనగా సర్వ శక్తిమంతుడే; అయిననేమి? నీవు లేనిచో అనీశుడే - ఏ సామర్థ్యమును లేనివాడే సర్వశక్తి స్వరూపిణివి నీవే అందువలననే నిన్నే శరణము పొందుట అని భావము

"శివ శ్శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం ।
న చే దేవం దేవో న ఖలు కుశలః స్పందితు మపి ।
(సౌందర్య లహరి)

(2) 'హి' ప్రసిద్ధిని తెలుపును "ఆ విషయము నీకు గూడ తెలిసినదే" అని భావము

ఋకారవర్ణగ్రహణే మా
తృణం శల్యాయతే స్మృతం మనసి ।
ఆత్మార్పణం వి వైతత్
కథమివ నిర్యాతయే జగజ్జనని ।

తాత్పర్యము :

దేవి! నీవు సమస్త ప్రపంచమునకును తల్లివి మరి నాకును తల్లివే గదా? 'ఋ' అను వర్ణము నాకు చెవిని బడినప్పుడంతయును ఆ యక్షరముతో చేరియున్న "మాతౄణం" అనుమాట గుర్తునకు వచ్చును అది గుర్తునకు వచ్చిన వెంటనే "ఈ తల్లి ఋణమును ఎట్లు తీర్చుకొందును?" అను నాలోచన శల్యము వలె హృదయమును బాధించును తల్లివగు నీకు నన్ను నేను సంపూర్ణముగా అర్పించుకొనకున్నచో ఆ నీ ఋణము ఎట్లు తీర్చుకొనగలను? అందువలన, ఇదుగో ఆ పని ఇప్పుడు చేయుచున్నాను నా యీ సర్వస్వార్పణమును దయతో స్వీకరించి నన్ను ఋణవిముక్తునిగా అనుగ్రహింపుము

విశేషములు :

"మాతృ+ఋణం = మాతౄణం" ఇట్లు సంధి వశము చేత మాత్రమే 'ఋ' కారము భాషలో కనిపించును కావుననే ఋ కారమును విన్నప్పుడు 'మాతౄణము' అన్న పదము గుర్తునకు వచ్చుట

మానవుడు ఏ ఋణమునైనను తీర్చుకొనగలుగును, కానీ తల్లి ఋణమును తీర్చుకొనలేడు తన శరీరముతో గూడ సర్వస్వమును ఆమెకు అర్పణము చేయుట యొక్కటే తరణోపాయము

శ్రీ వర్ణవత్ క్లిష్ట పదాశ్రితాం మనో
భువః పునర్జీవనదాయినీం పరాం ।
సువర్ణ శైలాగ్ర కదంబ వాటికా
నివాసినీం మంగళమూర్తి మాశ్రయే ।

తాత్పర్యము :

వర్ణ సమామ్నాయములోని 'శ్రీ' కారమునకును, పరమేశ్వరికిని అపురూపమగు నొక పోలిక యున్నది ఎట్లనగా శ్రీ కారము ఒక క్లిష్ట శబ్దములో తప్ప భాషలో మరి యే పదములోను లేదు కాబట్టి 'క్లిష్టపదాశ్రిత' మగుచున్నది పరమేశ్వరియును తన్ను ఆశ్రయించిన వారికి ఉన్నత పదమును కల్పించునది కాబట్టి 'క్లిష్టపదాశ్రిత' యగుచున్నది ఈ విధముగా శ్రీ కారములో పోలిక కలదియు, పరమేశ్వరుని కంటిమంటచే భస్మమైపోయిన మన్మథునకు మరల ప్రాణదానము చేసినదియు, బంగారు కొండయగు మేరు పర్వతము కొననున్న కడిమిచెట్ల తోపులో నివసించునదియు జగన్మంగళ స్వరూపిణియు నగు నా పరమేశ్వరిని ఆశ్రయించుచున్నాను

విశేషములు :

(1) 'క్లిష్ట పదాశ్రితాం' క్లిష్టమైన పదము (= పదవి) గల ఆశ్రితులు కలది అని దేవీ పరముగాను, 'క్లిష్ట' అను పదమును ఆశ్రిత (ఆశ్రయించినది) అని శ్రీ కారము పరముగాను విగ్రహ వాక్యములను గ్రహింపవలసి యున్నది

(2) "మనో    దాయినీం" "హర నేత్రాగ్ని సందగ్ధ కామ సంజీవ నౌషధిః" (ల స నా)

(3) "సువర్ణ    నీం" "సుమేరు శృంగమధ్యస్థా", "కదంబవన వాసినీ" (ల స నా)

శ్రీకార ఇవ కేనాపి
శబ్దే నాదర్శితాకృతిం ।
ఆగమై కోజ్జ్వలా మార్యా
మనన్యశరణః శ్రయే ।

తాత్పర్యము :

శ్రీ కారము వలె ఏ శబ్దము చేతగాని తన రూపమును ప్రకాశింప చేయనిది యైనను ఆగమములయందు మాత్రము ముఖ్యముగా ప్రకాశించునది యగు ఆర్యా మహాదేవిని మరియొక రక్షకుడు లేని నేను ఆశ్రయించుచున్నాను

విశేషములు :

"శ్రీ కార    తిం" శ్రీ కారము యొక్క రూపము భాషలో ఏ పదమునందు గాని అగుపడదు; కాని ఆగమములందు అకారాది క్షకారాంత వర్ణమాలలో బీజాక్షరముగా నిలిచియున్నది అట్లే పరమేశ్వరి స్వరూపమును గూడ ఏ శబ్దము గాని 'ఇది యిట్టిది' అని నిర్ణయించి తెలుపలేదు "యతో వాచో నివర్తంతే" అని శ్రుతి కాని సర్వాగమముల లోను ఆ దేవితత్త్వము ముఖ్యముగా ప్రకాశించుచున్నది

(2) "అనన్య శరణః" మానవునకు అనన్య భక్తి యొక్కటియే తరణోపాయము

ఏకా త్వ మేవ శరణం జగదంబ! సర్వే
లోకా స్త్వ దున్మిష దనున్మిష దృష్టిపాతైః ।
స్వీకుర్వతే భువన మస్తమయం చ కాఽన్యా
పాకారి వంద్య చరణే! తరణి ర్భవాబ్ధేః ।

తాత్పర్యము :

సమస్త ప్రపంచమునకును తల్లివగు ఓ దేవీ! అందరకును రక్షకురాలవు నీవొక్కతవే! ఏలయన, అన్ని లోకములును నీ కడగంటి చూపు ప్రసరించినపుడు కలిగి నీవు రెప్ప మూసినంతనే ప్రళయము నొందుచున్నవి మూడు లోకములకును ప్రభువగు దేవేంద్రుడు గూడ నీ పాదములకు నమస్కరించుచున్నాడు ఈ సంసార సాగరమును దాటుటకు నీవు తప్ప మరియొక నావ ఏమున్నది?

విశేషములు :

(1) 'జగదంబ' తల్లి కావుననే రక్షణకై ఆమెను, బిడ్డలు ఆశ్రయింతురు ఆమెయును వారిని వాత్సల్యములో చేరదీసికొని కాపాడును

(2) 'భువనం' ఈ పదము 'భూ' ధాతువునుండి కలిగినది; దానికి 'సత్త - ఉనికి - వ్యక్తరూపమును పొందుట అని అర్థము 'సదైక్షత' అని శ్రుతి; పరమేశ్వరుని యిచ్ఛారూపయగు దేవి యనుగ్రహముచేతనే సర్వ ప్రపంచమును మహదాది క్రమముగా వ్యక్తమగుచున్నది

(3) 'అస్తమయం' సూర్యుడు అస్తమించి మరల ఉదయించినట్లు అనాదిప్రవాహమగు ప్రపంచముగూడ లయమై అట్లే నశింపదు; మరల ఉదయించును

ఐదం పర్యేణా ప్యనుదృన్నముద్రా
మామ్నాయా యాం నిత్య ముచ్చైః స్తువంతి ।
తా మాలంబే తత్పదైకార్థరూపాం
కామాక్షీం హృత్కంజపీఠాధివాసామ్ ।

తాత్పర్యము :

సర్వ వేదములును పరమేశ్వరి తత్త్వమును తెలుపుటకే ప్రవృత్తములైనవి, కాని దానిని నిరావరణముగా తెలుపలేక నిత్యమును ముక్తకంఠముతో ఆమెను నుతించుచున్నవి "తత్త్వమసి" అను మహావాక్యము నందలి 'తత్' అను పదమునకు పరమార్థము ఆదేనియే ఆమెయే 'కామాక్షి' అనబడుచున్నది ఆమెను నా హృదయ కమలమను పీఠమునందు స్థిరముగా నిలిపి ఆశ్రయించుచున్నాను

విశేషములు :

(1) "ఐదం స్తువంతి". "సర్వే వేదా య త్పద మామనంతి" అని శ్రుతి కావున అన్ని వేదములు ఆ పర తత్త్వమునే తెలుపబూనినవి కాని "అదికాదు, ఇదికాదు" అని నిషేధరూపమునవే తప్ప 'ఇదిగో ఇది' అని నిర్దిష్టముగా తెలుపలేకున్నవి

(2) "తత్పదైకార్థరూపాం" "తత్పద లక్ష్యార్థా" (ల స నా)

(3) "హృత్ పాం" హృదయము తామరమొగ్గ వంటిది అది అధోముఖముగా నుండును ప్రాణాయామ రూప యోగశక్తిచేత అది ఊర్ధ్వముఖమై వికసించును ఉపాసకులకు ఆ దశలో పరమేశ్వరి అచట ధ్యాన గోచర యగును

"పద్మకోశ ప్రతీకాశం హృదయం చా ప్యధో ముఖం" - (మంత్రపుష్పము)

(4) "కామాక్షీం" పరమేశ్వరి తన కంటిచూపుచేతనే భక్తుల కోరికల నన్నిటిని తీర్చునది; కాబట్టి ఆమెకు ఆ పేరు

"సర్వస్య సాక్షిభావేన తత్తత్కామా నపూరయత్ ।
త ద్దృష్ట్వా చరితం దేవ్యా సర్వలోక పితామహః ।
కామా క్షీతి తదా నామ దదౌ కామేశ్వ రీతి చ ।     (బ్రహ్మాండ పురాణము)

ఓజాయేతే౽ హిమ హిమ రుచీ యన్మహిమా౽ం శైకదేశాత్
బీజం తావ ద్భువన జననే యత్కటాక్షైకపాతః
సాజాత్యం యచ్చరణ యుగళీ సారసానాం వహంతీ
రాజీవాక్షీ వసతు హృదయే రాజరాజేశ్వరీ సా ।

తాత్పర్యము :

ఏ దేవి తేజస్సునందలి యత్యల్పమగు భాగము వలన సూర్యచంద్రులు తేజోమూర్తులై ప్రకాశించుచున్నారో, ఏ దేవి క్రేగంటి చూపుచేత మాత్రమే సమస్త ప్రపంచమును సృష్టింపబడుచున్నదో, ఏ దేవి పాద యుగళము తామరపూవులతోడి సాదృశ్యమును వహించుచున్నదో కమలములవంటి కన్నులు గల ఆ రాజరాజేశ్వరీదేవి నా హృదయమునందు నివసించుగాక

విశేషములు :

(1) "ఓజా    శాత్". "తస్య భాసా సర్వమిదం విభాతి" అని ఉపనిషద్వాణి

*యదాదిత్య గతం తేజో జగ ద్భాసయతే౽ఖిలం ।*
*య చ్చంద్రమసి య చ్చాగ్నౌ త త్తేజో విద్ధి మామకమ్ ।*    (భగవద్గీత)

పరమేశ్వరి పరబ్రహ్మ స్వరూపిణి; కావున ఆ దివ్యతేజము ఆమె తేజోంశమే

(2) "*బీజం    తః*" సృష్టిక్రియ సర్వమును పరమేశ్వరీ విలాసమే

(3) "సాజాత్యం    తీ", "రాజీవాక్షీ"

దేవి పాదములు భక్తులకు ఆశ్రయములు కావునను, ఆమె కటాక్షము ఆశ్రిత తారకము కావునను ఆ రెండింటిని ప్రత్యేకముగా పేర్కొనుట

(4) 'రాజీవాక్షీ' 'ర+అజీవ+అక్షి' అను విభాగము వలన మన్మథుని బ్రదికించిన కన్నులు (చూపు) కంది అనియు అర్థాంతరము

"కామ సంజీవనౌషధిః" (ల స నా)

ఔచిత్యసార మఖిలాగమ తత్త్వరాశేః
ఆనంద కందళ మవాఙ్మనసాధిగమ్యం ।
అంతర్నిహిత కరణై రనుభావ్యమానం
ఐశ్వర్య మైశ్వర మనశ్వర మాశ్రయామః ॥

తాత్పర్యము :

అన్ని శాస్త్రములును, అవి ప్రకటించు నన్ని తత్త్వముల సముదాయమును పరమేశ్వరిని ఆశ్రయించియే ఔచిత్యవంతములై సమన్వయము నొందుచున్నవి బ్రహ్మానందము అంకురించు దివ్యస్థానమును ఆమెయే మాటలలో 'ఇట్టిది' అని చెప్పుటకు గానీ, మనస్సులో గుర్తించుటకు గానీ ఆమె తత్త్వము అందరానిది; కాని సర్వేంద్రియములను మనస్సులోను, దానిని బుద్ధిలోను లీనముంగునట్లు నిగ్రహించిన పరమ యోగులు ఆ యానంద రూపమును అనుభవింతురు ఈశ్వరుని ఈశ్వరత్వమునకు కారణము ఆ మహాదేవియే శాశ్వతమైన ఆ దివ్యతత్త్వమును ఆశ్రయించుచున్నాము

విశేషములు :

(1) "ఔచిత్య ... శేః" వేదములును శాస్త్రములును ఇతర విషయములను గూర్చి యెన్ని చెప్పినను వాని అన్నింటికిని పరతత్త్వ ప్రతిపాదనము నందే తాత్పర్యమనుట నిర్వివాదము ఆ పరతత్త్వమే పరమేశ్వరి

"సర్వేవేదా యత్పద మామనంతి" (శ్రుతి)
"సకలాగమ సందోహశుక్తి సంపుట మౌక్తికా" (ల స నా)

(2) "ఆనందకందళం" "నిత్యానంద కలికా" (ల స నా)

(3) "అంత ... మానం" "కశ్చి ద్ధీరః ప్రత్యగాత్మాన మైక్ష దావృత్త చక్షు రమృతత్వ మాయన్" (శ్రుతి)

బాహ్య విషయ ప్రవృత్తములగు నింద్రియములను అంతర్ముఖములనుగా చేసినపుడే సాధకుడు పరతత్త్వమును చూడగలుగును

అంహోవిదారిణి! సమస్త శుభైకమూలే ।
బంహిష్ఠ పుణ్య పరిపాక విశేషలభ్యే ।
రంహస్వి మే హృదయ మధ్య విశ త్వవిద్యా
సంహారిణీశ్వరి! భవచ్చరణాబ్జయుగ్మే ।

**తాత్పర్యము :**

పరమేశ్వరి! సమస్త పాపములను నశింపజేయునదియు, సర్వ శుభములను చేకూర్చు నదియు, అనేక జన్మార్జితమగు మహాపుణ్యము పరిపాకమునకు వచ్చినవారికి గాని లభింపని దియు, జనన మరణాదిరూప మగు నవిద్యను తుదముట్టించునదియు నగు నీ పాదకమల యుగళమునందు తహతహలాడుచున్న నా మనస్సు ప్రవేశించుగాక!

**విశేషములు :**

(1) "బంహిష్ఠ    లభ్యే" ఎన్ని జన్మముల పుణ్యమో పరిపాకమునకు వచ్చిన గాని పరబ్రహ్మ సాక్షాత్కారము లభింపదు

"బహూనాం జన్మనా మంతే జ్ఞానవాన్ మాం ప్రపద్యతే" (భగవద్గీత)

(2) "రంహస్వి" వేగము గలది - ఎప్పుడెప్పుడు దేవి చరణములను ఆశ్రయింతునా అని వేగిరపాటు గలది

(3) "భవ    గ్మే" దేవి పాదములను కమలములనుగా చెప్పుటచేత హృదయము ఒక తుమ్మెద తుమ్మెద కమలములను తహతహలో ప్రవేశించునట్లు హృదయము దేవిపాదముల నాశ్రయించి ఆనందము పొందును

అః కేశవ ఉ॥ శ్శశిధర
మభిధత్తే మోపి ఎంకదో ద్భూతిం ।
తత్రితయ రూపిణీం త్వాం
ప్రణవార్థమయీం నమామి పరమేశీమ్ ।

తాత్పర్యము :

ప్రణవాక్షరమగు ఓంకారమును భేదదృష్టిలో విడమరచినప్పుడు ఏర్పడునట్టి అకార - ఉకార - మకారములు వరుసగా విష్ణువును, ఈశ్వరుని, బ్రహ్మను తెలుపుచున్నవి; కాని సమష్టి దృష్టిలో చూచినప్పుడు ఏకాక్షరమగు ఆ ఓంకారము ఆ త్రిమూర్తుల అభిన్న మూలతత్త్వమై పరబ్రహ్మ స్వరూపిణివగు నిన్నే తెలుపుచున్నది ఇట్లు ప్రణవార్థ రూపిణివగు పరమేశ్వరిని నమస్కరించుచున్నాను

విశేషములు :

"ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ" అను శ్రుతి వాక్యముచేత ఓంకారము ఏకాక్షరముగానే గ్రహింపబడి పరబ్రహ్మమునకు వాచకమును, ప్రతీకయును అభిన్నమును అగుచున్నది దాని విభాగము సృష్ట్యాది క్రియా మూలకములు అవిద్యా విలాసమే పరమాత్ముని చిచ్ఛక్తి రూపిణియగు పరమేశ్వరి ఆ బ్రహ్మముకంటె వేరుకాదు అందువలన దేవి ఓంకారవాచ్య యగుచున్నది

త్రయీం తిస్రోవృత్తీ స్త్రిభువన మథో త్రీ నపి సురా
నకారాద్యై ర్వర్ణై స్త్రిభి రభిదధ త్తీర్ణవికృతి
తురీయం తే ధామ ధ్వనిభి రవరుంధాన మణుభిః
సమస్తం వ్యస్తం త్వాం శరణద! గృణా త్యోమితి పదమ్

(మహిమ్న స్తోత్రము)

పరమేశ్వరి పరమేశ్వరాభిన్న,

కామాక్షి సస్మితాపాంగ
కళోల్లాస ముపాస్మహే ।
స్థాణో రపి యదున్మేషాత్
సార్వజ్ఞ్య ముపతిష్ఠతే ।

తాత్పర్యము :

ఏ దేవి చిరునవ్వులోడి క్రేగంటి చూపు యత్యంత ప్రసరించినంతమాత్రమున స్థాణువు (పట్టిమొద్దు)నకు గూడ సర్వజ్ఞత్వము ప్రాప్తించునో, భక్తుల కోరికల నన్నింటిని తీర్చు చూపులతో ఏ దేవి 'కామాక్షి' యను పేరిట ప్రసిద్ధి నందుచున్నదో ఆ దేవి కటాక్షమును ఆరాధించుచున్నాము

విశేషములు :

(1) "కామాక్షి" సర్వజ్ఞ యగు దేవి తాను సాక్షిమాత్రముగ నుండి అందరు దేవతల కోర్కెలను తీర్చిన విషయమును చూచి బ్రహ్మ ఆమెను 'కామాక్షి' అను పేరుతో నుతించెనని బ్రహ్మాండ పురాణము

(2) 'స్థాణువు' అనగా పట్టి మొద్దు; ఏమియు తెలియనివాడు; అట్టివానికిగూడ దేవి కరుణా కటాక్షముచే సర్వజ్ఞత్వము - అన్నింటిని తెలిసికొనగల శక్తి లభించును

ఇచట మరియొక విశేషమున్నది 'స్థాణువు' అనగా స్థిరుడు = అచలుడు = కూటస్థుడు అగు పరమేశ్వరుడు "వ్యోమకేశో భవో భీమః స్థాణూ రుద్ర ఉమాపతిః" (అమరము ) అటువంటి పరమేశ్వరునకు చిచ్ఛక్తి రూపిణి యగు దేవి సంబంధముచేతనే జ్ఞానశక్తి స్పందనము కలిగినది "కృశానురేతా స్సర్వజ్ఞః" (అమరము )

దేవీ కటాక్షము ఇంతటి ప్రభావము కలది కావున దానిని ఆరాధించుట వలన అజ్ఞులగు అస్మదాదులకును జ్ఞానము కలుగు నని భావము

ఖం వాయు రగ్ని రుదకం పృథివీ త్యనేవ
యత్ర క్రమేణ సముదేతి జగ త్సమస్తం ।
యస్మి న్ననంత మహసి ప్రవిలీయతే, తత్
తత్త్వం పురారితపసాం తను మాశ్రయామః ।

తాత్పర్యము :

ఆకాశము, వాయువు, అగ్ని, జలము, భూమి అను పంచభూతములును ఏ పరతత్త్వమునుండి క్రమముగా (= తొలిదాని నుండి తరువాతిదిగా) కలిగి ఈ సమస్త ప్రపంచమును ఏర్పడుచున్నదో, ప్రళయకాలమునందు ఆ సమస్త ప్రపంచమును అనంత తేజ స్స్వరూపమగు నే పరతత్త్వమునందు లీనమగుచున్నదో, ఆ పరతత్త్వమును, పరమేశ్వరుని తపస్సే రూపమును దాల్చి తానుగా వెలసినట్లున్న ఆ పరమేశ్వరిని ఆశ్రయించు చున్నాము

విశేషములు :

(1) "ఖం స్తం" "ఆత్మన ఆకాశ స్సంభూతః" ఇత్యాదిగా పరమాత్మ నుండి తొలుత ఆకాశమును, దానినుండి వాయువును, దానినుండి అగ్నియును దానినుండి జలమును, దానినుండి పృథివి (భూమి)యును కలిగినవి అనియు ఆ పృథివి నుండి ఓషధులు ఇత్యాది క్రమముగా సమస్త ప్రపంచమును కలిగినది అనియు,

(2) "యస్మిన్ తే" ప్రళయకాలమున అవి కడపటి నుండి అనగా పృథివి నుండి ఒక్కొక్కటియు తనకు ముందున్న భూతమునందు లీనమగుచు తుదకు సర్వమును ఉద్భవ కారణమగు పరమాత్మయందే లయించుననియు ఉపనిషత్తులు తెలుపుచున్నవి

'తజ్జలానీ త్యుపాసీత' అను ఉపనిషద్వాక్యముచే సర్వమునకు జన్మలయ హేతువు అగు ఆ పరతత్త్వమే ఉపాసింపదగినది పరమేశ్వరి ఆ పరతత్త్వమే

(3) "పురా తనుం" 'స ఐక్షత' అను శ్రుతిచేత బోధింపబడునట్టి ఈక్షణమే పరమేశ్వరుని తపస్సు; పరమశివుని తపస్సునకు ఫలముగా పార్వతీదేవి లభించిన దనుట పౌరాణికము

గణేశోఽనభివ్యక్త వాగింద్రియాత్మా
కుమారోఽపి తద్వ్యక్తి సంపన్నరూపః ।
తదీయా హి మాతా విదేవ త్వ మంబ ।
ప్రదేహి త్వ దున్మేష ముద్భిన్నతోషమ్ ।

తాత్పర్యము :

తల్లీ! మూలాధార చక్రమునందు అస్పష్టముగా ఉద్భవించిన వాగింద్రియము గణేశ తత్త్వ మనియు దాని వ్యక్తస్థితి కుమార తత్త్వమనియు శాస్త్రములు తెలుపుచున్నవి ఆ గణేశ్వరునకును కుమారునకును తల్లివిగా పురాణములం యందు ప్రసిద్ధి నొందిన నీవు ఆ వాగింద్రియ దశలకు రెండింటికిని ఉద్భవ నిదానమగు జ్ఞానశక్తి వనుటకు ఏమి సందేహము? అట్టి చిద్రూపిణివైన నీవు బ్రహ్మానంద కారణమగు జ్ఞానమును నాకు ప్రసాదింపుము

విశేషములు :

శబ్దబ్రహ్మము మూలాధారమునందు కారణబిందుస్పందరూపముగా నుండి పురుషేచ్ఛచేత ప్రేరింపబడిన వాయువుతో కలిసి సూక్ష్మాతి సూక్ష్మమై అవ్యక్తమైన వాగింద్రియముగా - అనగా "పరా" వాక్కుగా రూపొందుచున్నది అందువలన మూలాధార చక్రమునకు అధిదేవతయగు గణేశ్వరుడు అవ్యక్త వాగింద్రియ రూపుడగుచున్నాడు

"వాగ్వై సుబ్రహ్మణ్యా" అను శ్రుతి ప్రమాణము ననుసరించి కార్యబిందు స్పంద రూపమై 'పశ్యంతి' క్రమముగా వ్యక్తమైన వాక్కు కుమార స్వరూప మనబడుచున్నది

ఈ రెండింటికిని మూలకారణము చిద్రూపిణియగు పరమేశ్వరి

ఇచట గ్రహింపవలసిన విషయము మరికొంత ఉన్నది 'పర, 'పశ్యంతి', 'మధ్యమ' 'వైఖరి' అని దశాభేదములంచేత వాక్కు నాలుగు విధములుగా నున్నది వానిలో పర సంపూర్ణముగా అవ్యక్తము 'పశ్యంతి, మధ్యమ'లు క్రమవ్యక్త దశలు; 'వైఖరి' సంపూర్ణ వ్యక్తము వీనిలో మొదటి మూడును శరీరము లోపలనే గూఢములై యుండును వానిని యోగులు మాత్రమే తెలిసికొందురు నాలుగవది మాత్రమే మనుష్య వ్యవహార యోగ్య మగుచున్నది ఈ విషయమును ఈక్రింది శ్రుతి ప్రమాణము తెలుపుచున్నది

"చత్వారి వా క్పరిమితా పదాని
తాని విదుర్బ్రాహ్మణా యే మనీషిణః ।
త్రీణి గుహా నిహితా నే ఙ్గయంతి
తురీయం వాచో మనుష్యా వదంతి" ।

పై నాలుగింటిలో మొదటి రెండును (ఒక మతమున తొలిది మాత్రమే) కారణ బిందుస్పందరూపము లనియు తుది రెండును కార్యబిందుస్పందరూపము లనియు శాస్త్రములు వివరించుచున్నవి

ఘటయితు మథ భంక్తుం కంజ జాండాని మాతః
స్ఫుట ముపగతశక్తిం స్వాంగభాగార్పణేన ।
నటనపర మధీశం న్యస్య సాక్షిత్వమాత్రే
పటు రసి పరిచేతుం పంచకృత్య ప్రపంచమ్ ।

తాత్పర్యము :

తల్లి! పరమేశ్వరుడు తన శరీరములో సగము భాగమును నీకు సమర్పించి బ్రహ్మాండముల నన్నింటిని సృష్టించుటకును, పాలించుటకును, సంహరించుటకును కావలసిన సామర్థ్యమును సంపాదించుకొన్నాడు అయిననేమి? ఆయన నటరాజు! నాట్యమునందే ఆయనకు ఆసక్తి అందువలన ఆయన యానందమునకు భంగము కలుగకుండ ఆయనను సాక్షిమాత్రుడుగానే ఉంచి నీవే సృష్ట్యాది కార్యముల నన్నింటిని నిర్వహించుచున్నావు నీ ప్రభావము ఎంత మహనీయమైనది!

విశేషములు :

(1) "ఘట క్తుం" సృష్టి లయములను రెండింటినే చెప్పనను ఆద్యంతములను చెప్పుటచే నడుమ నున్న పాలనముగూడ గ్రహింపబడుచున్నది

(2) "స్వాం ణేన" పరమేశ్వరుడు అర్ధనారీశ్వరుడు

(3) "సాక్షిత్వమాత్రే" పరమేశ్వరునకు కర్తృత్వాదులు లేవు, ఆయన సాక్షిమాత్రుడే "నిత్యకర్తార మవ్యయమ్" (భగవద్గీత)

(4) "పంచకృత్య ప్రపంచమ్" సృష్టి స్థితి లయములును, తిరోధా నావిర్భావము లును అను నైదును "పంచకృత్యములు" అనబడును 'లయము' అనగా సర్వభూతములును పరమాణువులలో లీనమగుట అనియు 'తిరోధాన' మనగా ఆ పరమాణువు గూడ పరమాత్మలో (పరమేశ్వరిలో) లీనమగుట అనియు విశేషము 'అనుగ్రహము' లేక 'ఆవిర్భావము' అనగా లీనమైన పరమాణువు మరల సృష్టికి ఉన్ముఖమై వెలువడుట

*సృష్టికర్త్రీ బ్రహ్మరూపా, గోప్త్రీ గోవింద రూపిణీ ।*
*సంహారిణీ రుద్రరూపా, తిరోధానక రీశ్వరీ ।*
*సదాశి వానుగ్రహదా (ల ~ ~ )*

ఓకారవన్నిత్య ముదీర్యతే యః
శ్వాసోఽనునాసం వినియమ్య సమ్యక్ ।
త మంత రున్నిద్రహృదంబుజే త్వా
ముపాసతే చిన్మయి! యోగరూఢాః ।

తాత్పర్యము :

తల్లీ! యోగనిష్ఠులగువారు ఓకారమువలె నాసికా మార్గమును అనుసరించి నిత్యమును బహిర్ముఖముగా వెలువడునట్టి శ్వాసమును అంతర్ముఖముగా చేసి నియమించి, దానివలన వికాసము నందిన హృదయకమలమునందు చిద్రూపిణి వగు నిన్ను ఉపాసించుచున్నారు

విశేషములు :

(1) 'అనునాసమ్' అనగా నాసికా మార్గమును (ముక్కు రంధ్రములను) అనుసరించి - అనగా దానిగుండ వెలువడునది అనునాసికము "ఞ, మ, ఙ, ణ, నానాం - నాసికాచ" అని పాణినీయ సూత్రము, ఓ కారమును పలుకునప్పుడు నోటితో పాటు ముక్కునుండి గూడ వాయువు వెలువడును కావున ఓ కారము అనునాసికము అనబడుచున్నది ప్రాణవాయువు గూడ శ్వాసరూపకముగ ముక్కునుండియే వెలువడుచున్నది అందువలన అదియును అనునాసికమే కాబట్టి "శ్వాసము ఓ కారము వంటిది" అని పోల్చబడినది

(2) "ఉన్నిద్ర ......జే" "శ్వాసనిరోధము వలన హృదయ కమలము వికసించు" ననియు, "అది పరమాత్మకు ఉపలబ్ధి స్థాన"మనియు యోగశాస్త్ర ప్రసిద్ధము

చలతి న చలతి చ యస్మిన్
చలతి న చలతి ప్రపంచ మిద మంబ !
విలసతి విలసతి యస్మిన్
కులకుండేశి! త్వమేవ తత్తేజః ।

తాత్పర్యము :

తేజోరూపిణి వగు నో తల్లీ! ఏది కదలినచో సమస్త ప్రపంచము చైతన్యవంతమై కదులుచున్నదో, ఏది ప్రకాశించినచో తాను ప్రకాశించుచున్నదో, ఏది కదలక నిలిచినప్పుడు సర్వము చైతన్యరహితమై జడత్వమును పొందునో ఆ పరతత్త్వము నీవే! నీవు మూలాధార చక్రము నడుమ నున్న బిందువును ఆశ్రయించి కుండలినీ రూపమున ధ్యాన గోచర యగుచున్నావు

విశేషములు :

"మూలాధార కర్ణికా మధ్యగతో బిందుః కులకుండమ్" (లలితా సహస్రనామ భాష్యము కులకుండమనగా మూలాధారచక్ర మధ్యమున నున్న బిందువు పామువలె మూడున్నర చుట్టలతో తన పడగవంటి భాగముతో బిందువును కప్పియున్న ప్రథమదమనికి 'కుండలిని' అని పేరు "అది పరమేశ్వరి స్వరూప"మని శ్రీ విద్యా సిద్ధాంతము కులకుండమును ఆశ్రయించియున్నది కావున దేవి 'కులకుండేశి' అయినది

"అవాప్య స్వాం భూమిం భుజగ నిభ మధ్యుష్ట వలయం
స్వమాత్మానం కృత్వా స్వపిషి కులకుండే కుహరిణి ।

(సౌందర్యలహరి)

ఛలేనాపి నైవ స్మరా మ్యన్యదైవం
విలోలం మమేదం మన స్త్వత్పదాబ్జే ।
మిళిందాయమానం మరంద ప్రపూరైః
తులా మేతు మత్తస్య సుప్తస్య వాంబ ॥

తాత్పర్యము :

తల్లీ! నిన్ను దప్ప మరియొక దైవమును పొరపాటున నైనను స్మరింపను నా మనస్సు ఎప్పుడును నీ పాదకమలమునందే తుమ్మెదవలె ఆసక్తమై యున్నది అది అందు పొంగి పొరలు కరుణా మరందమును త్రావి త్రావి అట్లే మత్తుగొన్నట్లు లేదా సుషుప్తి దశను పొందినట్లు బాహ్యజ్ఞానము లేకుండ ఆనందానుభవమును పొందునట్లు అనుగ్రహింపుము

విశేషములు :

(1) 'మత్తస్య' - జాగ్రదవస్థయందు ఇంద్రియజ్ఞానముతో బాటు మనో వ్యాపారమును ఉండును స్వప్నావస్థయందు ఇంద్రియజ్ఞానము ఉండదు మనోవ్యాపారము మాత్రమే ఉండును సుషుప్తి యందు అదికూడ లయమై బాహ్యజ్ఞాన శూన్యమగు ఆత్మ ప్రశాంతానందము నందును మనుష్యుడు గాఢనిద్రనుండి లేచిన తరువాత "నేను హాయిగా నిద్రపోయితిని" అను భావనలో సుషుప్తియందలి ఆనందానుభవము వ్యక్తమగుచున్నది

(2) "నైవ వం" అందరు దేవతలును పరమేశ్వరి అంశస్వరూపులే అందువలన ప్రతి దేవతామూర్తి యందును పరమేశ్వరీ భక్తుడు ఆ జగన్మాత స్వరూపమునే చూచును అందువలన అతనికి అన్యదేవతా స్మరణము ఉండదు

జగదంబ! యదావతో ప్యుపాంతం
సహతే న ప్రియశేఖరేందులేఖాం ।
త దిదం కథ మంఘ్రిపంకజం తే
పవి రాపి న్మహిషాసురేంద్రమూర్ధ్ని ।

తాత్పర్యము :

జగజ్జననీ! పరమేశ్వరుడు ఒకప్పుడు ప్రణయ కోపముతో నున్న నిన్ను ప్రసన్నురాలిని చేసికొనుటకై నీ పదములపై వ్రాలగా ఆయన జటాజూటమునందు అలంకారముగా నున్న అతి సుకుమారమైన చంద్రరేఖ సోకినంత మాత్రముచే గూడ నీ పాదకమలమునకు నొప్పి కలుగునట! అంత సుకుమారతమమైన నీ పాదమును నీవు మహిషాసురుని తలమీద పెట్టి మట్టినప్పుడు అది వజ్రాయుధమువలె కఠినమై వానిని కూల్చివేసినది ఎంత విచిత్రము!

విశేషములు :

(1) సగుణమూర్తులగు పార్వతీ పరమేశ్వరుల లీలా విలాసమును పురాణ ప్రసిద్ధమగు మహిషాసుర సంహార కథయును ఇందు ప్రస్తావింపబడినవి. పరమేశ్వరి ప్రభావము అసాధారణము, ఆశ్చర్యకరమును అని భావము

*"మృషా కృత్వా గోత్రస్ఖలన మథ వైలక్ష్య నమితం*
*లలాటే భర్తారం చరణకమలే తాడయతి తే ।"*

(సౌందర్యలహరి)

పరమేశ్వరునకు ఇది యొక లీల

ఝణన్ఝంఝా మంజీర శింజాఽభిరామం
రణత్కింకిణీకాంచికారావరమ్యం ।
క్వణత్కంకణం నర్తిత భ్రూవిలాసం
ధిమీతి స్మరారే ర్మన స్తేంబ! లాస్యమ్ ।

తాత్పర్యము :

తల్లీ! నీ కాలియందెలు కలిగించు మనోహరములైన ఝుణఝుణ ధ్వనులతో గలగలలాడు చిరుగజ్జెలతోడి మొలనూలు మ్రోతలతో, కరకంకణముల కంధ్వనులతో వివిధ భంగుల వాడించు కనుబొమల యొయ్యారముతో నీవు కావించు సుకుమార నృత్యము స్వాత్తుగా మన్మథునే భస్మము చేసిన పరమేశ్వరునకు గూడ మనస్సున ఆనందపరవశము చేయుచున్నది

విశేషములు :

“లాస్యమ్” - సుకుమారమైన నృత్యమునకు ‘లాస్య’మనియు, ఉద్ధతమైన దానికి ‘తాండవ’మనియు పేర్లు పరమేశ్వరి నృత్యము లాస్యము; పరమేశ్వర నృత్యము తాండవము తొలిది సృష్టి స్థితులకు, మలిది ప్రళయమునకు హేతువు. సృష్ట్యాదికము పరమేశ్వరునకు లీల; అందువలన పరమేశ్వరి లాస్యము పరమేశ్వరునకు ఆనందదాయకము

ఇకార సాదృశ్య మి వైషి మాతః
వినా యదీయేన పరిగ్రహేణ।
న సిధ్యతి జ్ఞాన; మహావృణు త్వ
త్వదాప్తయే తత్ పరమేశి! మహ్యమ్ ।

తాత్పర్యము :

తల్లీ! ఇకారము తోడుపాటు లేనిదే జ్ఞానము (= జ్ఞానమను పదము) సిద్ధింపనట్లు నీ యనుగ్రహము లేనిదే జ్ఞానము సిద్ధింపదు అందువలన నీవు ఇ కారముతో పోలికను పొందినట్లున్నావు పరమేశ్వరీ! నీవు అనుగ్రహించి నాలోని జ్ఞానమును కప్పియున్న తెరను తొలగింపుము దానిచే నీ పాద సన్నిధిని పొందెదను

విశేషములు :

(1) "సాదృశ్య మివైషి" - ఇ కారముతో పోలిక యథార్థము కాదు అది చేరదీయుట వలన (దాని తోడ్పాటుతో) 'జ్ఞాన'మను పదము మాత్రమే ఏర్పడును ఈ పోలిక ఒక చిన్న చమత్కారము మాత్రమే

(2) "వినా జ్ఞానమ్" పరమేశ్వరి యనుగ్రహము ఉన్ననేగాని జ్ఞానము లభింపదు.

"యమే వైష వృణుతే తేన లభ్యః (శ్రుతి)

(3) "ఆహావృణు" కామరూపమగు అజ్ఞానము జ్ఞానమును కప్పియుండును పరమేశ్వరి యనుగ్రహము వలన అది తొలగును

"అజ్ఞానే నావృతం జ్ఞానమ్"

"ఆవృతం జ్ఞాన మేతేన జ్ఞానినో నిత్య వైరిణా।

కామరూపేణ కౌంతేయ! దుష్పూరే ణానలేన చ ।" (భగవద్గీత)

టంకోత్కీర్ణా వైద్రుమీ పుత్రికేవ
ప్రత్యుప్తా వా పద్మరాగప్రభాభిః
పుంజీభూతజ్యోతి రుద్భిన్నరూపా
మూర్తి స్తేఽంత ర్మే దివి ప్రాదురస్తు ।

తాత్పర్యము :

తల్లీ! ఉలితో చెక్కి తీర్చిన పగడపు బొమ్మయా లేక కాంతిమంతములగు పద్మరాగ మణులు దాపి తీర్చిన రూపమా లేక విశ్వాంతరాళమున నున్న తేజస్సులన్నియును ఒక రాశిగా చేరి దాల్చిన యాకారమా అన్నట్లు అరుణారుణమై ప్రకాశించు నీ దివ్యాకృతి ప్రత్యక్షమై నా హృదయమునకు పరమానందమును ప్రసాదించుగాక

విశేషములు :

(1) సగుణ రూపిణియగు పరమేశ్వరిని అరుణ వర్ణము కలదిగా ధ్యానించి ఉపాసించుట సకల విద్యాప్రదము.

"నిజారుణ ప్రభాపూర మజ్జద్బ్రహ్మాండమండలా" (ల స నా)

"కవీంద్రాణాం చేతః కమలవనబాలాతపరుచిం
భజంతే యే సంతః కతిచి దరుణా మేవ భవతీం ।
విరించి ప్రేయస్యా స్తరుణతర శృంగార లహరీ
గభీరాభి ర్వాగ్భి ర్విదధతి సతాం రంజన మమీ ॥"

(సౌందర్యలహరి)

ఓంకారేణ ప్రసవధనుషో విశ్వవిఖ్యాతకీర్తేః
కందర్పస్యాఽప్రతిహతగతే ర వ్యలబ్ధావకాశం ।
య త్త చ్చేతః త్రిపురజయినో ముక్తలజ్జం ననర్త
శ్రుత్వా లాస్యోచ్చలితలలితం తేఽంబ! మంజీరవాదమ్ ।

తాత్పర్యము :

సమస్త ప్రపంచమును జయించిన జగజ్జెట్టి మన్మథుడు; అతని త్రోవకు అడ్డులేదు అంతటివాని పూలవింటి టంకారము పరమేశ్వరుని హృదయములో రవ్వంతగూడ ప్రవేశింపలేకపోయినది త్రిపురములను జయించిన ఆ స్వామి దృఢదీక్ష అంతటిది. అంతటి నిష్ఠగల యా పరమేశ్వరుని మనస్సు నీవు లాస్యము చేయుటకై పాదము కదిలించినంతనే మనోహరముగా మ్రోగు పందెం రవళిని విని ఆనందపరవశమై సిగ్గువిడిచి పరవళ్లు త్రొక్కి నాట్యమాడినది! నీ ప్రభావ మెంత యద్భుతమైనది!

విశేషములు :

(1) "ప్రసవధనుషః" పూవులు మన్మథునకు బాణములు మాత్రమే కావు. విల్లుకూడ

"పుష్పధన్వా రతి పతిః" (అమరకోశము )

'ప్రసవమైన ధనుస్సు' అనగా "బాణములు తన నుండి పుట్టుచున్నా అన్నంత వేగముతో వానిని వేయజాలినది" అనియు స్వారస్యము.

(2) "త్రిపుర జయినః" త్రిపురాసురుల పట్టణములు మూడు బంగారు, వెండి, ఇనుము, లోహములతో నిర్మింపబడినవి కామగమనము గలవి వానిని ఈశ్వరుడు కాల్చివేసినాడు అని పురాణ ప్రసిద్ధి

"స్థూల సూక్ష్మ కారణ శరీరములు త్రిపురము" లనియు, "అవి నశించిన తరువాత నిత్యుడై వెలుగు తేజోరూపుడు పరమేశ్వరు" డనియు ఆధ్యాత్మికుల వివేచనము

"కాముని జయించిన పరమేశ్వరునే సమ్మోహితునిచేసిన దేవి ప్రభావ మత్యద్భుత" మని భావము

డమరుక నినదాన్ వివిచ్య భర్తుః
పణినమునిః ప్రణినాయ శబ్దశాస్త్రమ్ ।
జనని! తవ పదాంగద స్వనానా
మల మథవోఽపి వివక్తు మర్థజాతమ్ ।

తాత్పర్యము :

తల్లీ! నీ భర్తయగు పరమేశ్వరుడు తన చేతి డమరుకమును వాయింపగా ఆ ధ్వనులను పాణిని మహర్షి అక్షర సమామ్నాయమును తెలుపు పదునాలుగు సూత్రములుగా గుర్తించి అవి ఆధారముగా శబ్దశాస్త్రమును - అనగా వ్యాకరణశాస్త్రమును రచించినాడు ఈ విధముగా ఆ ధ్వనుల యర్థమును ఈ ఋషి తెలిసికొనగలిగినాడు కాని లాస్యము చేయుటకై నీవు కదలించిన పాదములయందు మ్రోయుచుండెడి ధ్వనులకు అర్థము లేమో పరమేశ్వరుడు పైతము వివరించి తెలుపజాలకున్నాడు ఏమి నీ మహిమ!

విశేషములు :

"డమరుక శాస్త్రమ్" పరమేశ్వరుడు తన నాట్యావసానమునందు లోకానుగ్రహము నకై తన చేతి ఢక్కను (= డమరుకమును) పదునాలుగుసారులు మ్రోగించెను ఆ పదునాలుగు ధ్వనులును 'అఇఉణ్' మొదలగు పదునాలుగు సూత్రము లయ్యెను వానికి మాహేశ్వర సూత్రములని పేరు వానిని ఆధారముగా చేసికొని పాణిని మహర్షి వ్యాకరణ శాస్త్రమును రచించెను. అది యీ క్రింది శ్లోకము తెలుపుచున్నది

*నృత్తావసానే నటరాజ రాజో*
*ననాద ఢక్కాం నవపంచ వారమ్।*
*ఉద్ధర్తుకామ స్సనకాది సిద్ధా*
*నేత ద్విమర్శే శివసూత్రజాలమ్ ।*

నీ భర్త చేతి డమరుకము ధ్వనులకు అర్థమును మహర్షులు గ్రహించి చెప్పగలిగిరి నీ పాద నూపురముల ధ్వనులను విన్నంతనే పరమేశ్వరుడు పరవశు డగును అయన వాని యర్థములను ఎట్లు గ్రహింపగలడు? గ్రహింపలేడు

"పరమేశ్వరి లాస్యము సృష్టి క్రియారంభము అప్పుడు పరమేశ్వరుడు మాయానిష్ఠు డగును ఎందుకు ఈ ఆరంభమో ఎవరు చెప్పగలరు?" అని తాత్త్విక భావన

"నీ భర్త చేతి డమరుకము కంటె నీ కాలియందెలు మహామహిమాన్వితము" అని యుత్కర్ష

ధురీతులామ్ ప్రపదకళా విలంఘతి
స్మయాపహే ఝషయుగళస్య లోచనే ।
ధరాత్మజాపి హి సరసీరుహ శ్రియం
పదైవ తే జనని! ధునోషి విస్మయమ్ ।

తాత్పర్యము :

తల్లీ! నీ మీగాళుల యందము తాబేళ్లను త్రోసిరాజనుచున్నది. నీ కనుదోయి బెదిరిన చేపల జోడును మీరియున్నది నీ పాదములన్నవో తామరపువ్వుల సౌభాగ్యమును కాదనుచున్నవి నీవు కొండ (హిమవంతుడు) కూతురవైనను అవయవ సౌభాగ్యము చేత కొలనులో పుట్టినవానిని గూడ తలదన్నుచున్నావు ఎంత ఆశ్చర్యము!

విశేషములు :

(1) "ధురీ   తి" ప్రపం పిక్కల్లు తాబేటి పైభాగము వలె నడియుబ్బుగా నుండుట సౌభాగ్య లక్షణము అందువలన కవులు వానిని అట్లు పోల్తురు

"కూర్మపృష్ఠ జయిష్ణు ప్రపదాన్వితా" (ల స నా.)

(2) "ధరా   స్మయమ్", 'సరసీరుహ' మనగా 'కమల'మనుట ప్రసిద్ధార్థము 'కొలనిలో పుట్టినది' అని వ్యుత్పత్త్యర్థము "కొండ (హిమవంతుని) కూతురవు కావున కాఠిన్యములో నుండవలసిన నీవు కొలను పుట్టువుల సౌకుమార్యమును, అందమును కాలిలోనే గెలుచుట ఆశ్చర్యకర మని చమత్కారము

ణమికర్తృతా ముదగాత్ ఽస్మి దృఢం
క్షమి కర్తృతా భవతు తే జనని!
అపరాధ ఏవ మయి కర్తృమతిః
త్వయి కర్తృతా తు న కదా ప్యనృతా ।

తాత్పర్యము

తల్లీ! నమస్కరించుటకు నేను కర్తను; క్షమించుటకు నీవు కర్తవు ఇది ముమ్మాటికి నిశ్చయము నర్వమునకు నీవే కర్తవు కాబట్టి "నమస్కరించుటకు నేను కర్త"నను అహంభావము ఒకవేళ తప్పు కావచ్చును; కాని క్షమించుటకు నీవు కర్తవనుట ఎన్నటికిని అసత్యము కాదు కదా? ("నన్ను క్షమింపుము" అని భావము)

విశేషములు :

(1) 'ణమి', 'క్షమి' సంస్కృత భాషలో ధాతువులను నిర్దేశించునప్పుడు వానిని ఇకారాంతములుగా గాని లేక 'తి' ప్రత్యయమును చేర్చి కాని చెప్పవలెనని వ్యాకరణ సంప్రదాయము దానిని అనుసరించి నమస్కారార్థకముగు 'ణముల్' ధాతువును, సహనార్థకముగు 'క్షమూష్' ధాతువును ఇట్లు ఇకారాంతములుగా ప్రయోగింపబడినవి

(2) "అపరాధ. మతిః" మానవుడు అస్వతంత్రుడు; పరమేశ్వరి (లేక - పరమేశ్వరుని) చేతిలోని క్రీడోపకరణము మాత్రమే మానవుడు తానే కర్తనని తలచుట అహంభావము వలన; అది బంధహేతువు. యథార్థమునకు అసత్యము

"అహంకార విమూఢాత్మా కర్తాహ మితి మన్యతే" - (భగవద్గీత)

తవ చరణ సరోజ సంగతం మాం
కుపితమతి ర్యది వా ధునోషి దూరం ।
తదపి చ న పునర్భవాయ మే స్యాత్
పదరజసో య దుపైమి పాత్రభావమ్ ॥

తాత్పర్యము :

తల్లీ! నేను సంపూర్ణముగా నీ పాదములపై వ్రాలియున్నాను అట్టి నన్ను "వీడు పాపాత్ము"డని కోపముతో నీ కాలిని విదించి దూరముగా త్రోసివేయుదువా? అట్లు త్రోసివేసినను మేలే; ఏలయనగా అప్పుడు నీ పాదధూళియైనను నామీద ప్రసరించు భాగ్యము కలుగును కదా? ఆ మాత్రము నాకు చాలును దానివలన నాకు పునర్జన్మము లేకుండ పోవును ("మోక్షము లభించు"నని భావము)

విశేషములు :

(1) పరమేశ్వరి పాదములను ఆశ్రయించుట సర్వధా మోక్షకారణము. ఆ దేవికి ప్రణతుడయినవాడు ఎంత పాపాత్ముడైనను ముక్తు డగును

(2) "నీవు కోపించినను నేను నీ పాదములను విడువను" అనియు భావము

"రుషా నిరుద్ధోఽపి శిశుః స్తనంధయః న జాతు మాతుశ్చరణౌ జిహాసతి"

(యామునాచార్యులు)

ధాకిట తరిగిణ తో మితి
నైకగతి స్ఫురిత తాళ సంచారం ।
ఆకలయే తవ మాతః
శ్రీకంఠ భ్రూవిలాసకం నాట్యమ్ ।

తాత్పర్యం :

తల్లీ! పరమేశ్వరుడు 'సెబాసు! మేలు! బాగు! బళి!' అని తన కనుబొమల నెగురవేయుచు మెచ్చుకొనుచుండగా చతురశ్ర త్రిశ్ర మిశ్రాది గతులతో వివిధ తాళములతో లయబద్ధముగా అడుగులను కదిలించుచు నీవు చేయుచున్న ఆ యద్భుత నాట్యమును నా హృదయమునందు భావించుకొనుచున్నాను

విశేషములు :

(1) "ధాకిట" మొదలగునవి లయానుకరణ శబ్దములు నాట్య ప్రసిద్ధములు చతురశ్రాదులు గతులు; 'ఆది', 'అట', మొదలగునవి తాళములు. సంచారము పద విన్యాసభంగి

(2) "శ్రీకంఠ భ్రూవిలాసకమ్ " 'శ్రీకంఠుడు' అనగా "కంఠమునందు విషము కలవాడు" అని వ్యుత్పత్త్యర్థము "నీ నాట్యము అట్టివానిని సైతము మెప్పించి కనుబొమల నాడించునట్లు చేసినది. అది యెంత మనోహరమైనది!" అని చమత్కారము

దర మంద! భవార్తి సంభవం
హర మృత్యుంజయ భావదీపికే।
కురు మా మరుణం సముల్లసత్
కరుణోల్లోల విలోచనాంచలైః॥

తాత్పర్యము :

తల్లీ! నీవు పరమేశ్వరుని భావమును ప్రకాశింపజేయుదానవు. జనన మరణ రూపమగు సంసారము వలన కలుగు బాధకు నేను భయపడుచున్నాను ఆ భయమును తొలగింపుము కరుణారసము పొంగిపొరలుచున్న నీ కటాక్ష వీక్షణములను నామీద ప్రసరింపజేసి నాకు ఏ బాధయును కలుగకుండ చేయుము

విశేషములు :

(1) "మృత్యుం     దీపికే" పరమేశ్వరుడు మృత్యువునే జయించినవాడు నీవు ఆయన సంకల్పమును ప్రకాశింపజేయదానవు అంతటి ప్రభావము కలదానికి నా యీ భయమును తొలగించుట యేమిలెక్క? అని భావము

(2) "పరమేశ్వరుని సంకల్పశక్తియే పరమేశ్వరి" అని తత్త్వము

ధరణీధరరాజకన్యకే! త్వాం
శరణం యా మ్యనపేక్షితాన్య దైవం ।
నిరుపాధికయాఽనుకంపయా మ
ద్వరివస్యా మురరీకురు ప్రసన్నా ।

తాత్పర్యము :

పర్వతరాజగు హిమవంతుని కూతురవగు నో తల్లీ! నేను ఇతర దేవతల నెవ్వరిని తలచకుండ నిన్నే శరణుపొందుచున్నాను సహజ సిద్ధమగు నీ దయాగుణముతో నా సేవను అంగీకరింపుము

విశేషములు :

(1) "ధరణీ కే" నీవు రాచబిడ్డవు; కావున శరణాగతుని కాపాడుట నీ ధర్మము" అని భావము

(2) "వరివస్యాం " నీవు నేను చేయు సేవకు అంగీకరించిన చాలును; అంతకన్న వేరేమియును కోరను' అని భావము

(3) ఫలాపేక్ష లేని భృత్య భావమే నిజమైన భక్తి

(4) "నిరుపాధికయా" నీవు దయామయివి. దయతలచుట నీకు సహజగుణము. అందువలన నా పాపపుణ్యములను గూర్చి ఆలోచింపకుండ నన్ను అనుగ్రహింపుము" అని భావము

న హి యది మయి దోషలేశో ఽమ్బ!
క్వ హి తవ కారుణికత్వకేతురుర్వ్యాం ।
జహి మయి రుషమేవ వా జగుప్సాం
సహనవతీ జననీ కుపుత్రకేఽపి ।

తాత్పర్యము :

తల్లీ! నేను పాపము చేసినవాడనే అనుకొందము. ఇట్టి నన్ను అనుగ్రహించినచో గదా దయామయివను నీ ప్రతిష్ఠకు గొప్పతనము కలుగును. నేను పుణ్యాత్ముడనే అగుదునేని అటువంటి నన్ను దయజూచుట యేమిగొప్ప? అందువలన పరమపాతకినని నాపై కోపమును గాని ఏవగింపునుగాని మానకుము తల్లి తన కొడుకు ఎంత చెడ్డవాడయినను ఓర్చుకొని వానిని వాత్సల్యముతో చూచుట సహజము కదా?

విశేషములు :

(1) "సహన వతీ" కొడుకు చెడ్డవాడు కావచ్చును; కాని ఎప్పుడుగాని ఎక్కడగాని కొడుకు చెడుపును గోరునట్టి తల్లి యుండదు

"కుపుత్రో జాయేత క్వచిదపి కుమాతా న భవతి" (దేవ్యపరాధ స్తోత్రము)

(2) 'జహి' ఇది త్యాగార్థకము 'ఓహాక్' ధాతువుయొక్క రూపము కాదు హింసా గత్యర్థకము 'హన' ధాతువు రూపమే సాధారణముగా దీనికి 'చంపుము' అని యర్థము అయినను అనేక మహాకవులు దీనిని 'విడువుము' అను నర్థమున ప్రయోగించియున్నారు "అనేకార్థా హి ధాతవః" - ధాతువులకు అర్థములు అనేకములు; ధాతు పాఠములో చెప్పిన యర్థములు ప్రాయికములు మాత్రమే అను వైయాకరణ సిద్ధాంతము ఈ ప్రయోగమునకు సాధకము

"జహి జంభారి ముకుటమ్" - (సౌందర్య లహరి)

"పాప్మానం ప్రజహి హ్యేనమ్" - (భగవద్గీత)

"హి = యస్మాత్; ప్రజహి = త్యజ" - (శంకర భగవత్పాదుల భాష్యము)

ఫలితం మమ పుణ్యసురద్రుమైః
సురభిః నను వాక్సుమవల్లరీ ।
భరిత ముజ్జ్వల చంద్రికయా మనః
స్మరసి మేఽనుచరేషు కృపావతి! ।

తాత్పర్యము :

దయామయివగు ఓ తల్లీ! ఎప్పుడైనను నీ సేవకుల ప్రస్తావన వచ్చినప్పుడు నన్నుగూడ వారిలో ఒకనిగా తలంచుకొందువుగదా? అంతమాత్రము నాకు చాలును నా పుణ్యములు కల్పవృక్షము వలెను పండినదనియు, నా వాక్కను పూలతీవె పరిమళమును వెదజల్లిన దనియును, నా హృదయము మిలమిలలాడు పండు వెన్నెలతో నిండినదనియును భావింతును

విశేషములు :

(1) "సురభిః ... రీ" పరమేశ్వరి స్తోత్రము చేయుచుండుటచే ఆమె యనుగ్రహము వలన వాక్కునకు దివ్యపరిమళము చేకూరును లౌకిక విషయములకు చిక్కిన వాక్ప్రసరణము నిర్గంధమే

(2) "భరిత ... మనః" 'యోగ సిద్ధివలన శరీరమునందలి యన్ని నాడులయందును చల్లదనము ప్రసరించు'ననియు, 'వెన్నెలవంటి ఆహ్లాదకరమగు నాకావాక వెలుగు మనస్సునకు అనుభవగోచరమగు'ననియు యోగశాస్త్ర ప్రసిద్ధము.

ఫలం మలంఘు సమాధి నిష్ఠితస్య
ప్రమథపతే స్తపసా మనుత్తమానాం ।
కులగిరికుల భాగధేయ మంతః
స్ఫురతు నిరస్త తమశ్చయం మహో నః ।

తాత్పర్యము :

మహత్తరమైన యోగనిష్ఠలోనుండి పరమశివుడు చేసిన తపస్సునకు సర్వోత్తమమైన ఫలముగా లభించినది. హిమవంతుని వంశమునకు దక్కిన మహాభాగ్యము, అజ్ఞానమను కటిక చీకటిని పారద్రోలునది యగు నా దివ్యతేజము నా హృదయమునందు ప్రకాశించు గాక

విశేషములు :

(1)"దక్షుని యజ్ఞమునందు అవమానింపబడిన సతీదేవి యోగాగ్నిలో ఆత్మాహుతి చేసికొన్నది. యజ్ఞధ్వంసము తరువాత పరమశివుడు తపోనిష్ఠను స్వీకరించినాడు సతీదేవి హిమవంతునికి కూతురై పార్వతిగా జన్మించినది. ఆమె లభింపగనే పరమేశ్వరుడు తపస్సు చాలించినాడు" అని పౌరాణిక గాథ

*అథావమానేన పితుః ప్రయుక్తా*
*దక్షస్య కన్యా భవపూర్వపత్నీ ।*
*సతీ సతీయోగ విసృష్ట దేహా*
*తాం జన్మనే శైలవధూం ప్రపేదే ।*

(కుమార సంభవము)

బలనిషూదన మౌళిమణిఘృణి
చ్ఛల నవోజ్జ్వల యావకరంజితే ।
జనని! తే చరణాంబురుహద్వయే
భజతు మే మతి రున్మద భృంగతామ్ ।

తాత్పర్యము :

తల్లీ! దేవేంద్రుని కిరీటమునందలి మణులకాంతులు వ్యాపించి క్రొత్తలత్తుక పూసినట్లు కెంపువన్నెల నింపిన నీ పాదములను కమలములపై వ్రాలిన నా మనస్సు మదించిన తుమ్మెదవలె అందే నిలిచి మధురానుభవమును పొందునుగాక

విశేషములు :

(1) "బల తే" ఇంద్రుడు నీ పాదములకు మ్రొక్కును అప్పుడు అతని కిరీటమునందలి మణుల కాంతులు నీ పాదములపై వ్యాపించును మ్రొక్కుట ఎందులకు? నీ యనుగ్రహము వలననే అతడు 'బలనిషూదనుడు' అనగా బలాసురుని చంపినవాడు అయినందులకు

(2) 'మణి' - మణి శబ్దము దీర్ఘాంతమును కలదు

(3) "ఉన్మద భృంగతామ్" తుమ్మెద మకరందమును నిండుగా త్రాగి మత్తెక్కి ఆ కమలము నుండి లేచిపోక అట్లే వ్రాలియుండును అట్లే దేవి పాదముల యమృత రసమును అనుభవించిన భక్తుని మనస్సుగూడ అందే అంటుకొని విశ్రాంతి నందును అట్టి దశను నాకు ప్రసాదింపుము అని భావము

భవపురంధ్రి! భవాంబుధి తారకం
భవతు మే శరణం చరణం తవ ।
కవయతా మనిశం యదనుస్మృతిః
స్రవతి వాఙ్మధు ధూత సుధారసమ్ ।

**తాత్పర్యము :**

పరమేశ్వరుని సహధర్మిణివగు ఓ తల్లీ! కావ్యరచనము చేయువారికి నీ పాదస్మరణమువలన అమృత రసమునుగూడ కాదని మరపించు కమ్మని వాక్కు తేనె సోనవలె నిరంతరము జాలువారును సంసార సముద్రము దాటించు నా నీ పాదము నాకు శరణ మగుగాక

**విశేషములు :**

(1) 'భవపురంధ్రి!' "భవతి ఇతి భవః" ("భూ సత్తాయాం" అని ధాతువు) అను వ్యుత్పత్తిచే 'భవుడు' అనగా నిత్య సత్తా స్వరూపుడగు పరమేశ్వరుడు ఆయన యింటిని నిలుపునది (= పురంధ్రి) ఆయనకు అభిన్నయై సర్వకృత్యములను నెరవేర్చునది పరమేశ్వరి చిచ్ఛక్తి

(2) పరమేశ్వరీ చరణ శరణాగతి ఇహమున మధుర కావ్యరచనా సామర్థ్యమును పరమున మోక్షమును ప్రసాదించును ఆ రెండును నాకు ప్రాప్తించుగాక అని భావము

"సకృ న్నత్వా నత్యా కథమివ సతాం సన్నిదధతే
మధుక్షీరద్రాక్షా మధురిమ ధురీణాః ఫణితయః"

(సౌందర్యలహరి)

పరమేశ్వరి యనుగ్రహమున్నగాని రసవంత మగు కవిత్వమును రచించు సామర్థ్యము లభింపదు

మధుమథన సహోదరి! త్వయాఽంత
ర్మథన సముద్గతయా మధు స్రవంత్యా ।
విధురిత బహిరంతరన్యభావం
ప్రథిత సుధీ భవనం మ మాఽస్తు చేతః ।

తాత్పర్యము :

విష్ణుసోదరి వగు ఓ తల్లీ! నిరంతర ధ్యానములో నా మనస్సును చిలుకగా చిలుకగా వెలువడి అమృతమును వర్షించు నీ రూపమును నాకు ప్రత్యక్షము చేయుము అంతట నా హృదయము వెలుపలగాని లోపలగాని ఇతరములగు తలపులు లేకుండ నశించిపోయి అమృతమయ మగుగాక

విశేషములు :

(1) "మధుమథన సహోదరి!" ; 'పద్మనాభ సహోదరీ - (ల స నా)

"యా మేనా కుక్షి సంభూతా సుభద్రా పూర్వజన్మని ।
కృష్ణేన సహదేవక్యా స్తస్మిన్ జన్మని కుక్షిగా ।"

(బ్రహ్మాండ పురాణము)

(ఈ యుద్ధారము ల స నా భాష్యము నుండి)

(2) "మధు స్రవంత్యా!" 'పరమేశ్వరి నుండి అమృతము జాలువారి సాధకుని నాడీమండలమును తనియించు'నని యోగసిద్ధాంతము

'సుధా సారాభివర్షిణీ' - (ల స నా)

(3) "ప్రథిత సుధీభవనమ్' - "పరమేశ్వరి ప్రత్యక్షమైనప్పుడు సాధకుడు సుధీభవనమును అనగా దేవత్వమును పొందును" అనియు భావము

యదనుభూతి నిరస్త రజస్తమో:
హృదయనిర్వృత మంబ! శమౌకసాం।
హృదయ మస్తు గతి స్తవ దర్శనం
తద పరప్రవాహి సుధారసమ్ ।

తాత్పర్యము :

ఇంద్రియ జయమును పొందిన మహాత్ముల హృదయము ఏ నీ దివ్య దర్శనము వలన ... తమోగుణములు మరి తలయెత్తకుండ పరమానందము నందుచున్నదో ... మృతము ప్రవహించు నా నీ దివ్య దర్శనమును నాకు ప్రసాదింపుము

...షములు :

(1) 'అపరప్రవాహి' 'నిరంతరముగా అమృతము ప్రవహించునట్టి' అని అర్థము "అపరప్రవాహా క్రియా సాతత్యే" అని పాణినీయ సూత్రము

(2) "ఇంద్రియ జయమును సాధించిన మహాత్ములకు లభించు నీ దివ్యదర్శనము సామాన్యుడనగు నాకు నీ యనుగ్రహము వలన లభించుగాక" అని భావము

రసమయీ కవితా యది తే కృపా
రసపరిస్ఫురితా జగదంబికే! ।
పదసరోజయుగే తవ మే వచః
స్వదతు సంభృత తన్మధుసౌరభమ్ ।

తాత్పర్యము :

జగజ్జననీ! నీ దయారసము చిలికించినచే కవిత్వము రసవంతమై ప్రకాశించును అందువలన నా రచనమును నీ పాదకమలములపై ఉంచుచున్నాను అది సహజముగా నిస్సారమే అయినను నీ పాదకమలములయందలి మకరందముతోను పరిమళమును నింపుకొని ఆస్వాద్యమగుగాక

విశేషములు :

(1) 'పదసరోజయుగే' "దేవి పాదములు కమలములుగా ఆరోపింపబడినవి అందువలన వానిలో మకరందమును పరిమళమును ఉండును గదా? కావున వానిపై నుంచిన రచనమునకును ఆ మాధుర్యమును ఆ పరిమళమును అబ్బును" అని భావము

(2) "పరిమళము దూరము వారిని ఆకర్షించును మాధుర్యము ఆస్వాదించువారికి ఆనందమును కలిగించును పరమేశ్వరి పాదములకు అర్పిత మగుటచే ఈ రచనము పఠితలకును శ్రోతలకును ఆనందదాయకమగు"నని తాత్పర్యము

లావణ్యమ య్యపి సుధామధురా, విలోకై ః
పీతాఽపి భక్త నిచయై ః పరివృద్ధరాగా ।
ధూత జ్వరాఽపి కృతదర్శనరాగతృష్ణా
దివ్యాకృతి ర్జనని! తే మమ సన్నిధత్తామ్ ।

తాత్పర్యము ః

తల్లీ! నీ రూపము మహోజ్జ్వలమగు లావణ్యము కలది అమృతము వలె మనోహర మైనది దానిని భక్తులు తమ కన్నులతో త్రావినంత యాబగా చూతురు అది అరుణారుణ మైనది, సంతాపములను తొలగించునది ఎంతకాలము చూచినను ఇంకను చూడవలెనను నభిలాషను కలిగించునది అట్టి నీ దివ్యరూపము నాకు ప్రత్యక్షమగు గాక

విశేషములు ః

(1) 'లావణ్య' మనగా అవయవ సౌందర్యమునకంటె భిన్నమై ఆ యవయవముల చక్కని పొందిక వలన కనపడునట్టి యందము

(2) 'లావణ్యమయీ' = ఉప్పనిది; 'మధురా' = తియ్యనిది; పీతా = పచ్చనిది; పరివృద్ధరాగా = ఎరుపురంగు మించినది; ధూతజ్వరా = తాపమును తొలగించునది, 'కృత తృష్ణా' = దప్పిని పెంచునది అని ఆయా పదములకు అర్థాంతరములు

వీనివలన "ఉప్పనిది అయినను తియ్యనిది, పచ్చనిది అయినను ఎఱ్ఱనిది, తాపమును తొలగించునది అయినను దప్పిని కలిగించునది" అని పరస్పర విరుద్ధములగు గుణములు కలిగియున్నట్లు స్థూలదృష్టికి తోచును

కాని పరిశీలింపగా తాత్పర్యములో తెలిపినట్లు ఆయా పదములకు వేరు అర్థము లుండుట వలన పై విరోధము లేకుండా పోవును

సాహితీ సంప్రదాయములో దీనిని "విరోధాభాస" మను పేరుగల అలంకార మందురు

వాఙ్మనసవిదూరం వందితామర్త్యవారం
దృఙ్మిషిత హృదంతారూఢ గాఢాంధకారం।
రుఙ్మయ మనవద్యం రూప మానందదీపం
దృఙ్ముకుళన వీక్ష్యం తేఽంబ! మే స్తాత్ పురస్తాత్।

తాత్పర్యము :

తల్లీ! వాక్కునకు గాని మనస్సునకు గాని అందనిదియు, దేవతలందరును నమస్కరించునదియు, తన చూపు మాత్రము చేతనే సర్వ ప్రాణుల హృదయములందున్న కటిక చీకటి వంటి అజ్ఞానమును నశింపజేయునదియు, తేజోరూపమై సర్వ శుభలక్షణము లతో గూడి ఆనంద స్ఫురణమును కలిగించునదియు కన్నులను మూసికొని అంతర్దృష్టితో చూచినప్పుడు మాత్రమే అగపడునదియు నగు నీ రూపము నాకు ప్రత్యక్షమగుగాక

విశేషములు :

(1) "వాఙ్మనస విదూరం' పరమేశ్వరి పరబ్రహ్మమే, బుద్ధిచేత అనుభవగోచర మగునదియే గాని వాక్కుచే వివరించుటకు గాని మనస్సుచేత వివేచించుటకు గాని సాధ్యపడునది గాదు

"దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా" (భగవద్గీత)

"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (ఉపనిషద్వాక్యము)

(2) "దృఙ్ముకుళన వీక్ష్యం" దృష్టిని బాహ్య విషయముల నుండి మరలించి అంతర్ముఖము చేసినప్పుడు మాత్రమే ఆత్మదర్శనము కలుగును

"కశ్చిద్ధీరః ప్రత్యగాత్మాన మైక్షదావృత్త చక్షు రమృతత్వ మాయన్"
(ఉపనిషద్వాక్యము)

శమదన హృదయాబ్జ చంచరీకం
సుమిత నిరంతర వాగ్లతాక మూకం।
హిమగిరి మహనీయ పుణ్యపాకం
మమ పురతోఽస్తు ముదేకరూప మేకమ్ ॥

తాత్పర్యము :

వెలుపలివియును లోపలివియును నగు నింద్రియములను నిగ్రహించి ధ్యానించు యోగుల హృదయ పద్మముల నంటుకొని తుమ్మెదవలె విహరించునదియు. మూగవారికి సైతము విరియబూచి దట్టముగా అల్లుకొని అంతకంతకు కొనలు సాగు తీగవలె భావపూర్ణమై నిత్య నూతనముగా సాగు వాగ్ధారను ప్రసాదించునదియు. హిమవంతుడు చేసిన గొప్ప పుణ్యములకు ఫలముగా అవతరించినదియు పరిపూర్ణానందమే స్వరూపముగా గలదియునగు నొకానొక తత్త్వము (= పరమేశ్వరి) నాకు సాక్షాత్కరించుగాక

విశేషములు :

(1) 'శమ కం' భక్తులు పరమేశ్వరుని లేదా పరమేశ్వరిని విడువనట్లు ఆ పరమేశ్వరీ పరమేశ్వరులు గూడ తమను ధ్యానించు భక్తులను విడువరు

"తస్యాహం న ప్రణశ్యామి'
"ప్రియో హి జ్ఞానినోఽత్యర్థ మహం న చ మమ ప్రియః"
"మాం భజంతి చ యే భక్త్యామయి తే తేషుచాఽప్యహమ్" - (భగవద్గీత)

(2) "సుమిత కమ్" పరమేశ్వరి యనుగ్రహము వలన మూగవానికి గూడ మనోహరభావ పూర్ణ మగు కవితాధార యలవడును మూకపంచశతి యిందులకు ఉదాహరణము

"అల్ప బుద్ధి నగు నాకు లభించిన యీ దివ్యంత కవన శక్తియును ఆ దేవి యనుగ్రహము వలననే" ని భావము

(3) 'ముదేక రూపమ్'. 'ఆనందో బ్రహ్మ' అని ఉపనిషద్వాక్యము ఆనందము పరబ్రహ్మమునకు స్వరూప లక్షణము పరబ్రహ్మమునకంటే వేరుగాని పరమేశ్వరియును ఆనంద స్వరూపిణియే

(4) "ఏకమ్" అద్వితీయ మైనది; అనిర్వాచ్యమైనది కూడ

షడానన స్యానన మంబిని ప్రియే
తదీయ పంచాననతాఽవశేషితం ।
విహాస మాత్మాననపంకతో ముఖం
వికాసయంతీ మహ మంబికా మయే ।

తాత్పర్యము :

ఒకప్పుడు పరమేశ్వరుడు కుమారుడగు కుమారస్వామిని చేరదీసికొని ముద్దు పెట్టుకొనెను స్వామి అయిదు ముఖములు కలవాడు; కుమారస్వామికి ఆరు ముఖములు; అందువలన స్వామి యయిదు ముఖములు కుమారుని యయిదు ముఖములను మాత్రమే ఒక్కసారిగా ముద్దు పెట్టుకొనగలిగినవి కుమారుని యారవ ముఖమునకు తండ్రిముద్దు లభింపలేదు అందుకై ఆ యారవ ముఖము చిన్నబోగా పరమేశ్వరి వాత్సల్యములో దానిని తాను ముద్దుపెట్టుకొని కలకలలాడునట్లు చేసినది అంతటి వాత్సల్యమూర్తి యగు జగన్మాతను శరణు పొందెదను

విశేషములు :

(1) 'షడాననస్య'. "అప్పుడే జన్మించిన కుమారస్వామి యొద్దకు మునిపత్ను లార్వురును కృత్తికల రూపమున వచ్చి పుత్ర భావనతో ఆ బాలునెత్తుకొని అందరును ఒక్కమారుగా పాలీయబోగా అతడు వారి నార్వురను తృప్తిపరచుటకై ఆరు ముఖములు ధరించి పాలు త్రావె"నని పురాణగాథ

మూలాధారము నుండి ఆజ్ఞాచక్రము వరకు గల యారు చక్రములే కుండలినీగత ప్రాణాగ్నిరూపుడగు కుమారుని యారు ముఖములని యోగసాధకుల సిద్ధాంతము

(2) 'ప్రియే' పరమేశ్వరుడు తనకు ప్రియుడు కావున కుమారుని యారవ ముఖమును చిన్నపుచ్చితివే అను స్వామి కొరతను దేవి తీర్చినది

(3) "తదీయ తమ్" (1) తత్పురుషము; (2) అఘోరము (3) సద్యోజాతము (4) వామదేవము (5) ఈశానము" అని తూర్పు మొదలు నాలుగు దిక్కులకును నాలుగును మీదికి ఒకటియుగా పరమేశ్వరునికి ముఖములు అయిదు

(4) 'అంబికామ్' జగన్మాత. వాత్సల్యమూర్తి. బిడ్డల యార్తిని రవంతయును సహింపదు కావుననే ఆ తల్లిని శరణము పొందుట

సకలోపనిష ద్విచింత్యసారాం
సకలంకాత్మ దురాపదృక్ప్రసారాం ।
సకలాపకలోజ్జ్వలావచూడాం
సకలేశీం సముపాశ్రయే భవానీం ॥

తాత్పర్యము :

అన్ని యుపనిషత్తులును ఏ దేవి తత్త్వమును వివిధ రీతులతో మననము చేయుచున్నవో, ఏ దేవి కరుణా కటాక్షము నిర్మల హృదయులగు వారికే తప్ప పాపాత్ములకు అందరానిదో, ఏ దేవి చంద్రకళను శిరోభూషణముగా ధరించి ప్రకాశించుచున్నదో, ఏ దేవి సమస్త లోకములకు సర్వాధికారిణియై యున్నదో ఆ దేవిని ఆశ్రయించుచున్నాను

విశేషములు :

(1) "సకలో సారాం" అన్ని యుపనిషత్తులు పరమేశ్వరీ తత్త్వమగు పరబ్రహ్మమును గూర్చి అనేక విధములుగా తలపోయుచున్నవే గాని ఇదమిత్థమని నిరూపింపలేకున్నవి" అని భావము

"సర్వోపనిషదుద్ఘుష్టా" - (ల స నా)

(2) "లబ్ధ పాపమనోదూరా" - (శ్రీ లలితా ౹౪౫౹)

(3) "సకలేశీం" కావుననే ఆమెను ఆశ్రయించుట

హరిహయమకుట మణిమరీచి
స్ఫురదురుకేసర పింజరం భవాన్యాః ।
నిగమ సురభిళం పదాబ్జయుగ్మం
నిరత ముపైమి భవాపహం శరణ్యమ్ ।

తాత్పర్యము :

దేవేంద్రుని కిరీటమునందలి రత్నముల కాంతులు కేసరమువలె పసుపు వన్నెను కూర్చుచు ప్రకాశించుచుండగా, తమ మాహాత్మ్యమును వేదములు పరిమళమును వలె వ్యాపింపజేయుచుండగా, సంసార బంధమును తొలగించునవియై భక్తులకు శరణము పొందదగినవియగు పరమేశ్వరి పాదకమలములను ఆశ్రయించుచున్నాను

విశేషములు :

(1) 'హరిహయ రం "త్రిలోకాధిపతియగు నింద్రుడు గూడ తన కిరీటము దేవి పాదములకు సోకునట్లు మ్రొక్కును అని చెప్పుటచేత దేవి అతనికంటెను అధికురాలు - సర్వేశ్వరి" అని భావము

(2) 'భవాన్యాః', 'భవాపహం' దేవి భవుని (= ఈశ్వరుని) రాణి; ఆమె పాదములు భవాపహములు (= ఈశ్వరుని తొలగించునది) అగుట యెట్లు అని విరోధము భవమును అనగా సంసారమును తొలగించునవి అని పరిహారము

ళకారస్య స్థానం పరత అహమః పశ్యతి జనః
సమామ్నాయే; త్వా మ ప్యహమి సకలే హి వ్యతిగతే ।
పరం శక్తో ద్రష్టుం; జనని! జహి మేఽహంకృతి మత
స్తతః పశ్యామి త్వాం శమివ పరమే మంగళపదే ।

తాత్పర్యము :

తల్లీ! వర్ణ సమామ్నాయమునందు అహమునకు అనగా అకారమునుండి హకారము పరకు నున్న అక్షర సముదాయమునకు తరువాతనే మానవుడు ళకారమును చూచు చున్నాడు అట్లే నిన్నుగూడ అహము (అహంకారము) సమస్తమును పోయిన తరువాతనే గదా దర్శింపగలుగుచున్నాడు? అందువలన తొలుత నీవు నా యహమును (అహంకారమును) తొలగింపుము ఆ తరువాత ఏ పదములోను తొలుత అగుపడని ళకారమును 'మంగళ' పదము చివర చూచినట్లు పరమ ప్రాప్యమగు మంగళస్థానము నందు నిన్ను దర్శింతును

విశేషములు :

(1) 'అహమ్' శబ్దమునకు అకారమునుండి హకారము పరకు నున్న యక్షర సముదాయ మనియు, మానవునిలోని యహంకారమనియు రెండర్థము లున్నావి

(2) 'మంగళపదే' అనుదానికి "మంగళము అను శబ్దమునందు" అనియు, "సర్వ మంగళములకును స్థానమైన పరమ పదమునందు" అనియును రెండర్థములు

వానివి ఆధారముగా చేసికొని చేసినదే పై కల్పనము

(3) అహంకారము అనగా "ఏ పనినైనను చేయునది నేనే ఆ పనివలన గలుగు ఫలమును అనుభవించువాడను గూడ నేనే" అను భావము ఇదియే జీవుని సంసార బంధనమునకు మూలము ఇది తొలగిపోయిననే గాని తత్త్వ దర్శనము కలుగదు పరమేశ్వరి యనుగ్రహము లేనిదే అది తొలగిపోదు అందువలన దానిని తొలగింపుమని దేవిని ప్రార్థించుట

క్షయప్రసక్తా మపి సర్వమంగళాం
శమైక సాధ్యా మపి రాగరూపిణీం ।
నిరీశ్వరా మ ప్యసురంజితేశ్వరాం
భజే భవానీం భవబంధ మోచనీమ్ ।

తాత్పర్యము :

ఏ దేవి ప్రళయకాలము నందు సమస్త ప్రపంచమును నాశము చేయునది యైనను 'సర్వమంగళ' అని పిలువబడుచున్నదో. ఏ దేవి రాగద్వేషములు లేని యింద్రియ నిగ్రహము మాత్రమే సాధనా మార్గమున పొందదగినది యైనను 'రాగరూపిణి' యైయున్నదో. ఏ దేవి తనకంటె ఈశ్వరుడు (= ప్రభువు) మరియొకడు లేనిదియైనను పరమేశ్వరుని రంజింప జేయునదియై యున్నదో. ఏ దేవి తాను భవపత్ని యయ్యును భవబంధమును తొలగించునదియో ఆ పరమేశ్వరిని సేవించుచున్నాను

విశేషములు :

(1) ఇచట ఆయా పదములకు గల యొక యర్థమును బట్టి పరమేశ్వరియందు పరస్పర విరుద్ధములగు గుణములు ఉన్నట్లు తోచినను. మరియొక యర్థమును బట్టి ఆ విరోధము తొలగి సమన్వయ మేర్పడుచున్నది

(2) సర్వమంగళాం పరమేశ్వరి ప్రపంచమును ఉపసంహరించుటగూడ పునస్సృష్టి కొరకే, కావుననే ఆమె సర్వమంగళ అను పేరు సార్థకమైనది

"శర్వాణీ సర్వమంగళా" (అమరకోశము)

(3) 'రాగరూపిణీం' 'రాగము' అనగా ఒక వస్తువును పొందవలెనను కోరికకు మూలమైన యాసక్తి, ఎఱుపురంగు' అని మరియొక యర్థము మొదటి యర్థమున విరోధము రెండవ యర్థమున పరిహారము

అకారాది క్షకారాంత మాతృకావర్ణ రూపిణీమ్ ।
అక్షరాం పరమాం దేవీ మాశ్రయే సర్వమంగళామ్ ।

తాత్పర్యము :

అకారము మొదలుకొని క్షకారము వరకు నున్న మాతృకా వర్ణములు ఏ దేవి స్వరూపమో, ఏ దేవి ప్రళయకాలమునందును సత్తామాత్రముగ నిలిచి భక్తులకు పరమప్రాప్యమై సమస్త శుభముల నొసగుచు సర్వమంగళ యను సార్థక నామముతో విలసిల్లునో ఆ జగన్మాతను ఆశ్రయించుచున్నాను

విశేషములు :

(1) "అకారా ...ణీమ్" విశ్వాంతరాళమునందు నిండియున్న అఖండ శబ్ద బ్రహ్మము పరమేశ్వరీ స్వరూపము అకారము మొదలు క్ష వరకు నున్న ప్రత్యక్షరమును ఆ దేవి తత్త్వమును ప్రకాశింపజేయు బీజాక్షరమే జపమాలకు 'అక్షమాల' అనియును పేరు ఆ దండ యందలి ఒక్కొక్క పూసయును అక్షర సమామ్నాయమునందలి యొక్కొక్క వర్ణమునకు ప్రతీకము క్షకారము 'మేరువు' అనబడుచున్నది

(2) "సర్వమంగళామ్" సర్వమంగళ నిధానమైన 'అమృత' శబ్దముతో ఆరంభమైన ఈ రచనము సర్వమంగళ నిధానమైన 'సర్వమంగళా' శబ్దముతో సమాప్త మగుచున్నది అందువలన దీనిని చదువు వారికిని వినువారికిని సర్వ శుభములును లభించుగాక అని శుభాశంసనము

'మంగళాదీని మంగళమధ్యాని మంగళాంతాని చ శాస్త్రాణి ప్రథంతే వీరపురుషాణ్యాయుష్మత్పురుషాణి చ భవంతి, అధ్యేతారశ్చ ప్రవక్తారో భవంతి" అని పతంజలి భగవానుల యుపదేశము

# సమర్పణమ్

శబ్దోఽర్థ స్సంఘటనా
భావోఽలంకృతి రి తీహ య న్మాతః ।
త త్తే తవ తే తవ తే
స్తవనం చ ముదే తవాఽస్తు తవ లసితమ్ ।

తాత్పర్యము :

తల్లీ! ఈ రచనము నందలి శబ్దము, అర్థము, కూర్పు, భావము, అలంకారము అన్నియును నీవే; ఏవియును నావి కావు స్తోత్రము గూడ నీ విలాసమే అందువలన ఆత్మీయమైన యీ స్తుతి నీకు ఆనందదాయకముగుగాక

విశేషములు :

"ముదే తవాస్తు" "ఎవ్వరికైనను" 'నాది' అను మమకారమునకు - అనగా - ఆత్మీయతకు ఆస్పదమైన వస్తువు ఆనంద హేతువగుట సహజము కదా? అందువలన ఆమె లీలయే అయిన ఈ స్తోత్రము ఆ పరదేవతా స్వరూపిణియగు తల్లికి తప్పక ఆనందమును గలిగించును" అని భావము

# ఫలశ్రుతిః

దేవీసువర్ణమాలేయం
ధ్రియతే యేన కంఠతః
పరా భట్టారికా తస్మై
ప్రసీదతి వరప్రదా ।

తాత్పర్యము :

ఈ దేవీ సువర్ణమాలా స్తోత్రము నెవడు కంఠస్థము చేసికొని నిత్యము పఠించునో ఆతనికి భక్తుల కోరికల నన్నింటిని తీర్చునట్టి త్రిపురసుందరీ దేవి అనుగ్రహించును

★

అవధానాన్వయ జనుషా
కవి సుహృదా చంద్రశేఖరాఖ్యేన ।
దేవ్యా హృదయ విభూషా
దీవ్యా ద్రచితా సువర్ణమాలేయమ్ ।

తాత్పర్యము :

అవధానము చంద్రశేఖర శర్మ అను పేరుగల కవిమిత్రునిచేత రచింపబడినది ఇది సువర్ణమాల వలె (బంగారు దండవలె) శ్రీ బాలా త్రిపురసుందరీ దేవి హృదయమునందు అలంకారమై నిత్యము ప్రకాశించును గాక

★ ★ ★